# దివ్యజ్యోతి

లేక

# భక్త కన్నప్ప





రచయిత:

విద్వాన్ చల్లా లక్ష్మీనారాయణశాస్త్రి

## ఇందలి పాత్రలు



### — పురుషులు —

1 తిన్నడు లేక కన్నప్ప (కథానాయకుడు)

2 అర్జునుడు

3 కిరాతుడు (శివుడు)

4 కాళహస్తీశ్వరుడు

5 జడదారి (భృంగి)

6 ముని (ఇంద్రుడు)

7 అనుచరులు 1. వెంకడు, 2. కన్నడు, 3. వీరడు.

8 వీరసేనుడు (తిన్నని సహచరుడు)

9 శివశర్మ (అర్చకుడు)

10 గార్గేయుడు } శివశర్మ శిష్యులు.
11 మైత్రేయుడు }

### — స్త్రీలు —

1 శంప (కథానాయిక)

2 చంప (శంపచెలికత్తియ)

3 మకరిక (ఒక అప్సరసాంగన)

4 పెద్దముత్తైదువ (పార్వతి)

5 జ్ఞానప్రసూనాంబ (కాళహస్తీశ్వరుని భార్య)

శ్రీపరాత్పర దేవతాయనమః

# దివ్యజ్యోతి

లేక





# భక్తకన్నప్ప

* నాంది

శ్రీమద్దివ్యనగేంద్ర నందని సదా
సేవింప; గైలాసమం
దామోదమ్ముననుండ కే యిటు సువ
ర్ణాస్యాఖ్య నద్యంతికో
ర్వీమన్ నిల్చి సమత్వ దృష్టిఁగను నా
శ్రీకాళహస్తీశ్వరుం
డోమున్ దిన్నని ప్రేమ సత్కృతి సమం
దోత్సాహమే పారఁగన్!

[నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి]



---

* కవి సామాజికులను సూచించుటంగము వదలి వేయఁబడినదని మనవి. విజ్ఞులు క్షమింతురుగాక!



౧ అంకము  ౧ రంగము

అర్జునుఁడు:—(ఇంద్రకీలాచలముపైఁ దపోనిష్ఠాగరిష్ఠుఁడై యాసీనుఁడై యుండును)

మకరిక:- (వెంటనే ప్రవేశించి) నాఁడు ప్రభాసతీర్థమున మకరినై పడియున్న నన్ను బాణిగ్రహణము జేసి యుద్ధరించిన దయామయుండితఁడేయని యీవిజయు నెన్ని దినంబులనుండియో మునిజనాశ్రమ పరిచారికనై సేవించుచుంటిని. కాని ఏమి ప్రయోజనము? ఇంతవఱకుఁ గన్నెత్తియైనఁ జూచినవాఁడుఁ గాఁడు. (కొంచెమూరకుండి) కానిమ్ము ఇది కడసారి ప్రయత్నముగదా! ఎట్టులేని యీసుందరాకారుని బడసి జన్మము జరితార్థ మొనరించు కొనియెదఁగాక! (అనితలపంకించి యుటనున్న మట్టికూజాను జంకయందిడికొని యర్జునుని సాభిప్రాయముగ విలోకించుచు నిష్క్రమించు చున్నది)

అర్జు:— (తోడనే సమాధివిరమించి కన్నులు దెరచి) శంకరా! చంద్రశేఖరా! దయలేదా-తండ్రి! నామనోరథముదీర్చి నాకు సాక్షాత్కారమొసంగు టెన్నడోగదా! (అని యొకవంకఁ జూచి) ఆ! ఏమిది! శాంతరస ప్రధానమగు నీతపోధనాశ్రమమున కీ వరాహమెట్లు వచ్చెను? (అనినిలువఁబడి బాణము సారించి) ఓసీ! వరాహమా! ఇంకెందుబోయెదవు? నిలువుము (అని పండ్లు బటఁబటఁ గొరుకుచు)

ఉ. ఓసి వరాహమా! మునిజనోచిత రమ్యలతాంత చిత్రితా
వాసములన్ జరింప నిటువచ్చితె! కర్ణకఠోర తావకా

భ్యాసిత విస్వరంబు; ప్రణవస్వర పూర్వ మునిప్రయుక్తగా
థానసముదాయ మింతకు యథార్థము వ్యర్థముగాఁగ దుర్మతీ!

(అని బాణము విడుచుచున్నాఁడు. కాని వరాహ మదృశ్యమగుచున్నది. తోడనే వెరఁగుపడి) ఔరా! ఏమిది! వరాహమే యదృశ్యమైనది!—అయ్యో! ఏమిచేయుదును! అమోఘంబైన మదీయ శరము నిరపరాధులగు నితరులకెట్టి హానిగల్పించునో గదా!

(అని బాణము పోయినవంకనే చూచుచు విచారించుచుండును)
(తెరలో) అయ్యో! చచ్చితిని. బాధ బాధ సహింపఁజాలను. సహింపఁజాలను. హా!

అర్జు:—(ఉలికిపడి) ఏమిది? స్త్రీ యాక్రందనము వలెనున్నది. తాపసకన్యయై యుండునా! (చూచి) సందియ మేమి! ఈహతభాగిని నా బాణమునకు గుఱియైనది. పోయి చూచెదఁగాక! (అని నిష్క్రమించును)

---

౧ వ యంకము  ౨ వ రంగము.

మకరిక:-(నూజాపైఁబడి) అబ్బా! బాధ బాధ సహింపఁజాలను సహింపఁజాలను (అని విలవిల తన్నుకొనుచుండును.)

అర్జునుడు:—(శరవేగమునఁ బ్రవేశించి) అపరాధమొనరించితిని సైరింపుము సైరింపుము (అని వినయమున దాపునకుఁజేరి తనబాణమును మెల్లగ మకరిక చరణతలమునెత్తి పెకలించుచుండును)

మకరిక:—(సాభిప్రాయమున నెడ నెడ నర్జునుని విలోకింపుచు స్పర్శసుఖానుభవము నటించుచు.) దేవీ! కాత్యాయనీ! ఈజన్మమున

కింతమాత్రమేని సుఖములభింప దనుకొంటిని. నీయనుగ్రహా మమునఁ బ్రియకరస్పర్శ సుఖానంద వీచీపరంపరల నుయ్యాల లూగు రాజహంసి నైతిని. (పైకి నవ్వుచు) ప్రాణదాత కే నెట్టి యుపకార మొనరించు కొనఁగలను? (అని తలవంచును.)

అర్జు:—(బాణమును బెకలించి) ఉపకారమా! ఎందులకు? నేనుగావిం చిన యపరాధము జాలకయా; (చిఱునవ్వుతో) తరుణీమణీ! బాధయెట్లున్నది? అపరాధమును సైరింపుము అని బాధపోవు నట్లు చరణతలము నొక్కి విడుచుచున్నాఁడు)

మకరి:—(చరణతలమును విలోకించుచుఁ దలపైకెత్తి సాభిప్రాయ ముగ నవ్వుచు లజ్జావినయ సంభ్రమము లుట్టిపడ) మహా భాగా! రక్షింపఁబడితిని. ఇందు మీయపరాధ మేమున్నది? (అని తలవంచుకొనును)

అర్జు:—అట్లైన ధన్యుఁడను (అని సాభిప్రాయముగ విలోకించుచుఁ దనకృతజ్ఞత వెల్లడించుచు లేవఁబోవుచున్నాఁడు)

[తాపసి ప్రవేశము]

తాపసి:— (అంతలో హఠాత్తుగఁ గోపముతోఁ బ్రవేశించి హస్త విన్యాస మొనరించుచు) ఓరీ! విషయలంపటుఁడా! నీవా తాపసివి. తపోధనునకీ శరశరాసనంబులతోడఁ బనియేమి? ఓరీ కపటసన్న్యాసీ! ఇంతవఱకుఁ గిరాతుఁడ వేయను కొంటిని ఇప్పుడు గ్రొత్తఁగ రసికుఁడవై తాపసకన్యకలఁగూడ వంచింప నెంచితివిగా! నీయకృత్యమునకు ఫలము కిరాతుండవై యను భవింపుము-పొమ్ము (అని కమండలూదకములను విడుచుచు) ఛీ! ఛీ! ఇంకనీ మొగమేనిఁ జూడనొల్లను (అని చురచురం జూచుచు నిష్క్రమించు చున్నాఁడు)

అర్జు:—(తలవాంచి మిన్నకుండును)

మకరిక:— (శాపసి ననుసరింపుచు) మహానుభావా! శాపము మఱలింపుము. నావలన నిష్కారణముగ నతని శపింప నేల? అతఁడు నిరపరాధి, కేవలము నిరపరాధి (అని పాదములపైవ్రాలుచున్నది)

తాప:—(కోపముతోఁ జరణాగ్రమున మకరికను ద్రోయుచు) మూర్ఖురాలా! నన్నేల బాధించెదవు? పొమ్ము! అవలకుఁ బొమ్ము! నీవును నతనిని బోయత్తవై యనుసరింపుము. పరమేశ్వరాను గ్రహంబున నంతయుఁ గ్రమంబునఁ జక్కఁబడఁగలదు పొమ్ము (అని త్రోసి నిష్క్రమించుచున్నాఁడు)

మకరిక:—ఆర్యా! మీకు నావలన నెట్టి విపరీతముగలిగెను? పుణ్యము నకుఁ బోయిన బాప మెదురైనట్లయ్యె.

అర్జు:— బేలా! విచారింపవలదు, అంతయు నీశ్వరసంకల్పమే (నవ్వి) చూడుము పరమేశ్వరానుగ్రహము గలదఁట ఆహా! ఈశాపమే నాకు వరప్రసాదమయ్యెను. ఇఁకఁ బోయివచ్చెదను. (అని యొకవంకఁజూడ నటఁ బూర్వోక్తవరాహము గోచరించును. తోడనే మహాకోపముతో బాణము నెక్కువెట్టుచు) ఓసీ! దుష్టవరాహమా! మఱలనేతెంచితివా? నీవలననే యింతటి యకార్యము సంఘటిల్లె, ఈమారు జచ్చితివిలెమ్ము (అని బాణమును విడుచుచున్నాఁడు తెరలో వరాహాకృతియగు మరణవేదనము వినవచ్చుచున్నది)

అర్జు:-(పట్టరాని సంతోషముతో) అమ్మయ్యా, ఇప్పటికిఁగదా వరాహము గడ తేరినది! (అని సవిమర్శనముగఁజూచి యాశ్చర్య

ముతో) ఇదేమి! చచ్చిపడియున్న వరాహముపై మఱల నింకొక బాణప్రయోగమా! ఆహా! ఈవిలుకాండెవ్వడు? ఓహోహో! ఎవ్వడో కిరాతునివలె నున్నాడు. అహా! ఏమి! ఈతని తేజస్సు! ఔరా! ఏమి! ఈతనిదుండగము! పందిమేనిపై నాటుకొనిన తనబాణమునే పెకలించుకొనుచుండెనా లేక నా- ఇంక సందియమెందుకు? నాబాణమునే చేతఁదక్కించుకొనియెను. పోయి విలోకించెదగాక (అని వేగమున నిష్క్రమించుచున్నాఁడు)

మక:—(నివ్వెరపడి చూచుచుండును)

పార్వతి:—(భయుత వేషముతో వెంటనే ప్రవేశించి మకరిక భుజముపైఁ జేయివైచి నవ్వుమొగముతో) అమ్మా! మాకోయదొర యిచ్చోటకు వచ్చియుండెనా?

మక:—(ఉలికిపడి వెనుకకుఁదిరిగిచూచి; రెండడుగులు వెనుకకువైచి తనమొఱలిని జూచుకొనుచు స్వగతము) ఆహా! ఏమి! ఈయమ్మ నాపైఁ జేయివైచినంతనే మొఱ లంతయు మంచిగందమలఁది నట్లయినది: ఈపులకాంకురము లేమి! చల్లని చెయ్యి ఈమె - నిక్కముగ భోయతయై యుండునా లేక మమ్ముద్ధరింప వచ్చిన జగన్మాతయా (పైకి వినయముతో) తల్లీ! నీ వెవ్వరవు?

పార్వతి—బిడ్డా! నేనొక చెంచుకొలమునకుఁజెందిన పెద్దముత్తైదువను తెలిసినదా! సరి - కాని మాదొరనుజూచితివా?

మక:—(వెఱగుపాటుతో) లేదు (స్మృతినభినయించి) మఱచితిని-ఒకవేళ నతఁడైయుండునేమో పరికించుము. (అని యొకవంక జూపును)

పార్వతి:—(సంతోషమునటించి) ఆగును అతఁడే! అతనితోఁ బెనఁగు లాడు నీయువకుఁడెవఁడు? ఈ ముష్టియుద్ధమేమి! ఎందులకు పొసఁగినది!— అయినను - మాకోయదొరతోఁ బోరునంతటి వాఁడా యీ యువకసన్యాసి! కపటసన్యాసివలెనున్నాఁడే!- కాకున్న జడబారులకు విల్లమ్ములతోఁబనియేమి! చిత్రముగ నున్నది. పిల్లా! పోయిచూతమూ! (అని మకరికపై మఱల చేయివైచుచున్నది. తెరలో పిడికిళ్ళ చప్పుడులు ధణాధణా మని వినవచ్చును.)

మక:—(కెవ్వున కేకవైచి నోటియందు వ్రేలిడి కొరుకుచు) అమ్మయ్యో! యీముష్టిఘాతమేమి! పాపమీయువకుఁడు గడుంగడుం డస్సిపోయినాఁడు. అమ్మా నీనాథుని మఱలింపుము. (అని బ్రతిమాలుచున్నది)

పార్వతి:—పిల్లా! భయపడవలదు - (నవ్వి) అతఁడు నీకేమి కావలయును?

మక:—(లజ్జనటియించి మిన్నకుండును)

పార్వతి—(నవ్వి) సరి-సరి-ఇఁక-తెలిసినది- ఓహో! నీ ప్రియుఁడా యేమి!— అయిన నింక నాలస్యమెందుకు - పోవుదము రమ్మ (అని మకరికను దీసికొనిపోవుచున్నది.

తెరజారును.

౧-వ అంకము  ౩-వ రంగము

(అంతఁ గిరాతార్జునులు పోరుచు నెడనెడ రోషముఁ బోటు మాటల నొప్పించుకొనుచుఁ బ్రవేశించుచున్నారు.)

అర్జు:—(ముష్టిఘాతమొనరించి క్రౌర్యముట్టిపడ రోషమున) ఓరీ! కిరాత హతకా! నీమాట లిక్కడ సాగు ననుకొంటివా! ఈమాటుఁ జచ్చితివి లెమ్ము (అని పిడికిటం బట్టి)

శా. చేతన్ జిక్కినయంత నే కుమతివై సిగ్గింతయున్ లేక దు
ర్నీతిన్ మామక బాణమందుకొని యోరీ! నాదియేయంచు నే
రీతిన్ బల్కెదు పాడియే తులువ? లేరే వేఁటకాండ్రిమ్మహిన్
నీతాతల్ దిగివచ్చినన్ విడువను నే నిన్నింతకున్ మూఢుఁడా!

(అని పైకి లంఘింపఁబోవుచున్నాఁడు)

ఈశ్వ:—(కిరాతవేషముతో వికటముగ నవ్వి) ఓరీ! మాయలమారి! ఇంక నీ ప్రలాపములు చాలింపుము- నీవా నన్ను దూలనాడె దవు? నీయోగ్యత చాలును (అని వికటముగ హస్తవిన్యాస మొనరించుచు)

సీ. బూడిదె కొంత మొగానఁ బోలుపుగాఁ గీలించి
శివభక్తి యని రెంటఁ జెడుటఁగాదు
విల్లునమ్ములుఁబూని విలుకాండ్రనున్ మించి
కపటతాపస చర్యఁ గనుటఁ గాదు
ఏవురు నొకయింతి యిల్లాలిగాఁ గొని
జనులు నవ్వఁగ నేలుకొనుటగాదు
కపటసన్న్యాసివై కామించి యువతులఁ
గొని దొంగవలె మెల్లఁ జనుటగాదు

తే. గీ. ఇట్టి నీదగు దుర్నీతి నీవ యెఱిఁగి
తలువ! మనలోన నెవ్వఁడో తెలిసికొనుము
చాలు మాతోడ వాదమ దేల వేఁట
కాండ్రు నీకంటె మిక్కిలి ఘనులుగాదె.

రమ్ము నీమదమడంచెదను. (అని కలియఁబడి కొంతవఱకు ముష్టియుద్ధమొనరించి సంఘర్షణమును నెపమ్మునఁ దన కిరాత వేషమును దొలగించుకొని క్రిందఁబడుచున్నాఁడు. అర్జునుఁడు శివునిపైఁ బడుచున్నాఁడు.]

• పార్వతి:- (బోయత వేషమును దొలఁగించుకొని మకరికతోఁ బ్రవేశించి నవ్వుచు) పిల్లా! చూడుము నీప్రియుఁడే గెలిచెను. (అని శివునుద్దేశించి) ఓ మహానుభావా! నీవెంతకైనను దగుదువు. ఏమందు వేని-

ఉ. అచ్చెరువయ్యె మీమనమునందిటు జాలివహించి భక్తునిక్
మెచ్చియు; నీవ క్రిందబడి మీఁదను నాతని నుండఁజేసి, యే
పొచ్చెము లేనివాని నెడఁ బోరొకటిక్ దగఁగూర్చి; వానికీ
విచ్చితివౌర దిగ్విజయ మింతకు నీయనురాగ మెట్టిదో!

(అని అట్టహాసముతోఁబాటుఁ గరతాళధ్వని గావించును)

అర్జు:—(చివాలునలేచి పార్వతీ పరమేశ్వరుల విలోకించి గుర్తించి శివుని పాదములపైవ్రాలి భక్తితో) దేవా! మహాపరాధిని- మహాపరాధిని - క్షమింపుము నా యిష్టదైవముని తెలియనైతిని. (అని పాదములనుండి లేవకుండును)

శివు:—(వాత్సల్యముతో) వత్సా! నీవేమి యపరాధ మొనరించితివి?

నిన్ను విలోకింప నేనే యీవిలాసమంతయుఁ గల్పించుకొంటిని.
రమ్ము (అని లేవఁదీసి కౌఁగిలించుకొనుచున్నాఁడు)

అర్జు:—(ఆనంద బాష్పములను గోటమీటుచు) తండ్రీ! పుత్రులనెడ నీకింతటి యనురాగ ముండెనని యిప్పుడుగదా తెల్లమైనది. దేవా! మహానుభావా!

తే. గీ. భక్తకోటిని రక్షింప భారమూని
పెక్కు వేసంబులందాల్చి పెరిమతోడ
గంటికిని ఱెప్పవిధమున వెంటనంటి
తనిపి రక్షింతు - సుతుల వాత్సల్యయుక్తి!

శివు:—నాయనా! నీవినయమే నిన్నుగాపాడఁగలదు. నీవు దేనికై యింతగా నాతోడఁ బోరితివో ఆబాణమునే గ్రహింపుము.— ఇదియే పాశుపతము - అనాయసముగ శత్రువులం బరిమార్చి శీఘ్రంబ జయంబు గొని విజయుండవగుము. గ్రహింపుము. (అని పాశుపత మిచ్చుచున్నాఁడు).

అర్జు:—(గ్రహించి కనులకద్దుకొని) తండ్రీ! మహాప్రసాదము. అనుగ్రహింపఁబడితిని. (అని మఱల నమస్కరించును).

శివు:—వత్సా! సిద్ధమనోరథుండవైతివి. లెమ్ము (అని యభయప్రదాన మొనరించుచున్నాఁడు.)

అర్జు:—(లేచి) తల్లీ! సర్వమంగళా! నమస్కారము లందికొనుము. (అనిఅట్లుచేయును).

పార్వ:—బిడ్డా! ధన్యుఁడవై తివి లెమ్ము.

అర్జు:-(లేచి యంజలిఘటియించి) జగజ్జననీ జనకులారా! ఇప్పటికిగదా కృతకృత్యుఁడ నైతిని. - ఆహా! ఆ మునివాక్య మమోఘము. అతనిశాపమే నాకు వరంబయ్యె. మంచియైనను-చెడుగైనను-తుదకు శుభముగఁ బరిణమించునని పెద్దలందురు.

శివు:—అగును, నాయనా! దానికి నీవే తార్కాణుఁడవు. నీమనంబు బరిశోధింప వచ్చినవాఁడు దేవేంద్రుఁడు- నీతండ్రి, మానిగాఁడు. మకరిక నీతపోభంగ మొనరించు నేవోయని నిన్ను వెంటాడుచుఁ తుదకు మీవిలాసములు మితిమించినంతనే చేయునది లేక విధివశమున శపించెను.

మక:—(తనలో) ఇదియా కారణము!

అర్జు:—ఆహా! నాయెడ మాతండ్రి కెంత వాత్సల్యముండెను!

పా:—అది సహజమేకదా నాయనా!

శివు:—అగును- అతఁడు నీకిడిన శాపమునకు ఫలము నుత్తరజన్మంబున ననుభవింపఁగలవు. నిన్ననుసరించుచుండిన నీయబల గంధర్వాంగన; ఈమెను బ్రిభాసతీర్థమున నీవు గరగ్రహణ మొనరించి యుద్ధరించితివి. ఆకారణంబునం జేసి యీమె బోయతయై యుత్తరజన్మంబున నిన్ననుసరింపఁగలదు ఈయువ సహచరీత్వంబునం జేసి నీభక్తిమగుల వన్నె కెక్కి, చరమావస్థయందు మీరిరువురును నాలోనైక్యము జెందెదరు. మఱియు నిటు వినుము.

తే. గీ. కలియుగంబున నుడుమూరుగ్రామ మొప్పి
పిదప శ్రీకాళహస్తియన్ బేరుతోడ
నలరు; నాక్షేత్రమున బోయవగుచు నీదు
యింతినిన్ గూడి నన్నేల యింతు తనఘ.

మఱియు-

తే. గీ. వందినొక దానినంపి నీవంత మిటులఁ
దీర్చిన విధాన బోయవై తిరుగునాఁడు;
మఱల బందినిబంపినిన్ దరికిఁ జీరి
దివ్యమాజ్యోతినిత్తు సంతృప్తి వత్స!

అర్జు:—మహాప్రసాదము (అని వినమితగాత్రుఁడగును)

మక:—తల్లిదండ్రులారా! చరితార్థులమైతిమి (అని పార్వతీపరమేశ్వరులకు నమస్కరించుచున్నది)

ఇరువురు:—బిడ్డా! సిద్ధమనోరథవైతివి లెమ్ము (అని అభయ హస్త మిడుచున్నారు)

మక:— (లేచి యొక ప్రక్కకు నిలువఁబడును)

శివు:- భరతకులావతంసా! నీవు బోయవైనను; గారణజన్ముఁడవై పూర్వ జన్మసంస్కారంబునం జేసి లోకాతీతుఁడవై భక్తశిరోమణివయ్యెదవు. ఇఁకఁ బోయిరమ్ము (అని చూచుచుండఁగనే పార్వతితోఁడఁ బరమేశ్వరుఁ డదృశ్యుఁడగుచున్నాఁడు)

అరు:—మకరికా! పరమేశ్వరానుగ్రహంబునం జేసి మనకిరువుర కొక కొ్రత్తసంబాధము సంఘటిల్లె.

మక:—(నవ్వి) అనుగ్రహంబుగాదు - పరమేశ్వరుని యాజ్ఞయే.

అర్జు:--సరియే- ఇక నాశ్రమమునకుఁబోవుదము రమ్ము; కాని మనము మనకార్యములయం దప్రమత్తులమై యుండవలయును (అని నడుచుచున్నాఁడు,)

మ:-మహాప్రసాదము. (అని తనలో) నేటికిగదా! నామనోరథము సిద్ధించినది. (అనిప్రియు ననుసరించుచున్నది.)

తెరజారును.

ఇది ప్రథమాంకము.

౨ వ అంకము ★ ౧ వ రంగము

(సమయము:- రాత్రికాలము. స్థానము:- తిన్ననియింటికి ముందరి ప్రదేశము. అంతట తిన్ననియనుచరులు గేరడములాడుకొనుచు ప్రవేశించుచున్నారు)

అందఱు: (గల్లంతుగ విరగబడినవ్వి) బలే _ బలే - మొంకన్నా - నీవు రా - యీరుడవు _ యీనాడుతంటే నీవేరా - (అని వెంకన్న వీపు జరుచుదురు)

వెంక:—(ఆవేశముతో) కాకపోతే యేందిరా యెర్రిమొగాల్లాలా యిదిగో యినండిరా నాకతబా. (అనిలేచి వికటముగ)

సీ. రణమున్న బరుగెత్తు రణశూరుడనుగాన
పట్టిన పాము నే వంపువాడ

అందఱు:—బలే! బలే! మొంకన్నా, తరువాత తరువాత

వెం:— నామీసముకో జూచి నన్నవండని తలం
నెవో- కాని, పేడి నాచెలిమికాడె

అంద:— యిదేందిరా కొత్త యిసయమే! తరువాత?

వెంక:— గుడ్లెన్నిమేని గ్రుడ్డైన దుంపకయే మెల్ల
దిగమింగి బ్రతని త్రేపువాడ

అంద:—(గొల్లుమని నవ్వి) రణసూరుడే! కాదనే మనమొంకన్న బోయ
వాలోకూడ సూరుండంటా)!.. ఆ!- తరువాత.

వెంక.— పదిముంత లేని కల్లదియున్న నొకగుక్క
లోపట్టి గడగడ ద్రావువాడ

అంద:—అబ్బో! అంతయినాసుడవా? తరువాత.

వెంక:— గీ. అరరె! పులియన్న నులుకు దేవయ్య రెల్ల
అంద:— (బెరిలో నోకరుచూచుకొని) అబ్బో! ఆ!
వెంక:—నాకడకు రండు సివవ మీరేకమగుచు
బులిని మెల్లగ బట్టు వచ్చాడు గుహేలు
మన యురమ్మున గ్రుచ్చి దానినివథింతు

అంద:—(నవ్వి) అబ్బో! సాలాసూరుడవురా యెంకన్నా! ఇంత సూర త్తం యెప్పుడు నేర్చినావురా? బలే - బలే (అని వీపుజఱచి హైరాను చేయుచున్నారు)
కన్న:—యిదేందిరా సూరత్తం? అసలు యీరన్న యీర త్తం యినా లిరా (అని భూమిచరుచును)
ఈర:—(లేచి ఆవేశముతో) మీరు ఆడిన ఆటలకు పాడిన పాటలకు యెంకన్న అనుకున్నారేంటో? ఆ! నాను ఈరన్నురా నేనే కాదురా యీరుణ్ణి మాకులపోళ్ళందరు యీరులేరా మెరి మొగాల్లాలా (అని అట్టహాసము చేయుచు)

సీ. భళి భళి మాయన్న బల్లెంబుతోడనే
పుల్లేను తూటుగా బొడవలెదె.
అంద:—బలే ఈరుడు!
ఈర:-అతనికంటెను ఘనుం డాచంటిమల్లన
యేడీగలను నొకేయేటుదునిమె.
అంద:—యీడందరకన్న గొప్పోడురా! ఆ! కానీరా
ఈర:. అతని తమ్ముడు సాము ఆర్నెలల్ బొనరించి
మూలనుండిన ముదిముండజంపె
అంద:—అబ్బో! బలే- యీరుడాయీడు

పులినిజంపెదనంచు బలశాలి మాబావ
సెవులపిల్లిని గత్తిచేతమొత్తె

అంద:—పొరసె-యీరన్నా—సీయీరత్తం యేడుందిరా. (అని ఊగుచు లేవఁబోవుచున్నారు)

ఈర:—యిదిగో యినండ్రా మీతొందరకాలా.

ఏటిగట్టునున్న రెంపెదకొంగ
లను విలోకించి దొంగలేయనుచు మన
యత్తకొడుకింట దాగితి నారుదినము
లట్టినేనింక వ్యర్థుండనగుదు నోక్కో?

రన్న:-ఓరన్నారురా నువ్వు యర్థుండని? ఈరన్నా, స రేకానీ, కొంగలో దొంగలో నీకు తెలియదంట్రా.

ఈ:—నేనంత యెర్రోణ్ణి పందిరా? (అని మీసములు మెలివేయును)

కన్న:—అరేయ్ మీగొంతులుకొయ్యా సాలించండ్రా మీపెతాబాలు సిన్న పెబువుగారిన్నారంటే మనమెడకాయలమీన తలకాయలుండవురా.

వీరసేనుఁడు:- (అపటీక్షేపమునఁ బ్రవేశించి) అబ్బా! మీకడుపులో నెంతయూక బెట్టినాడ్రా బొమ్మదేముడు. అదుగో! మన సిన్న పబువులవారు తిన్నయ్య, తిన్నంగ విల్లమ్ములుబూని యిటే వచ్చుచున్నాడు.

అంద:—బుద్ది బుద్ది. (అనిలేచి లెంపలువాయించుకొనుచు నిలువబడుచున్నారు)

తిన్నయ్య:-(యథోక్త ప్రకారముగఁ బ్రవేశించుచుఁ దనలో) ఓహో అనుచరులు నాకొఱకు బ్రతీక్షించుచున్న వారలుగఁ గనుబట్టెడిని, సత్వరము సమీపించెదను (అని అట్లుచేయుచున్నాఁడు

అంద:—(జోహారు లొసరించుచున్నారు)

తిన్న:—(బహుమాన సూచకముగ) తెంకలారా! మీకెల్లరకు గుశ లంబేగదా?

అంద:—మాకు కుశలంబేటికి తక్కువ నోరా. (అని మరల జోహారులు చేయుచున్నారు.)

వీర:—బాబయ్యా యేటకు యేమైనది. యేలికముదలక్కై యేచియున్నా రము.

తిన్న:—సరియే ఇంత నాలస్యమెందులకు

వీర సే:—ఓరీ! మన సిన్న పెబుత్రులవారికి యేర్పరచిన పూలదండెక్కడ రా? తీసికొని రండిరా. (అని చెయిసాపును)

వెంక:—సిత్తము సిత్తము (అని అందించుచున్నాడు)

వీర:—(అందుకొని తిన్న నలంకరించి) మాసిన్నపెబువులకు మాదొడ్డ జయము (అనికరతాళధ్వనియొనర్చును)

అంద:—(అనుకరించుచు జట్టులెగురుచున్నారు)

వీర సే:—ఇక నడువుడు.

అంద:—సిత్తము - సిత్తము (అని పైవాక్యముచ్చరించుచు జయధ్వానమొనరించుచు నిష్క్రమించుచున్నారు)

తెరజారును

---

౨ వ అంకము ★ ౨ వ రంగము

(ప్రదేశము-భీకరారణ్యము. సమయము-సాయంకాలము. అంతట తిన్నడు వరాహమును దరుముకొనుచు గోపముతో బ్రవేశించుచున్నాడు)

కెడియో మత్తిడినట్లు మైకము
బ్రవర్తించెన్; శరీరంబునం
దిది యే దోసమొ! నిద్రసైత మిపుడెం
తే నన్ను బాధించెడున్.

అబ్బా! ఈ నిద్దుర భరింపఁజాలను. ఇఁక ముందున కొక్కఁయ డుగేని నడుటకు శక్తిఁజాలకున్నది. అల్లదే నా బాణముండిన ప్రదేశము నకరిగి యించుక విశ్రమించెదఁగాక (అని రెండడుగులు ముందునకు వైచి సంతోషమున) ఆహా! ఈ శుభశకునంబు లేమి! ఇప్పు డదియొక్కఁటి తక్కువకాఁబోలు.

తే. అదరుచున్నది కుడిభుజ, హూర! వేఁట
యందశుభ మిట్టులయ్యె, నేమగునొ యింక
శంక లేల ఫలమ్ము వాంఛాని గూఢ
మగు; జలము నారికేళమం దమరినటుల

(అని తలపంకించి) కానిమ్ము, అంతకును బరమేశ్వరుఁడే గలఁడు. విశ్రమింపనిదే హృదయం బెప్పటిస్థితికి రానట్టులున్నది. (అని రెండడుగులు ముందునకు వైచి ఏదియో వినినట్లు నటించి) ఓహో! ఈ మాటల సవ్వడియేమి? (అని యేదియో విని) ఏమని? ఈ మారు నాబాణ మెంతదూరముబోవునో చూడుమనియా! ఈవాక్య మెంతయు మధురముగనున్నది. ఇందెవ్వరో జవరాండ్రు విలువిద్య నభ్యసించుచున్నట్లు దోఁచెడిని. (అని కొంచెమూరకుండి తలపంకించి) ఏమైనగానిమ్ము ముందుగ గొంతవడి విశ్రమించి వేఁటయందలి బడలికను నివారించుకొని యెదఁగాక. (అని మెల్లమెల్లఁగ నిష్క్రమించుచున్నాఁడు)

(తెరజారును.)

౨-వ అంకము ౩-వ రంగము

అంత నెమర తెరనెత్తఁగ శంపయును బోయచిన్నది తన చెలి క్షత్రియతో విలువిద్య నభ్యసించుచుఁ బ్రవేశించును.

శంప:—చెలీ! చంపా! ఈమారు నా బాణ మెంత దూరముపోవునో చూడుము. (అని బాణము నెక్కు-బెట్టుచున్నది)

చంప:—ఆఁ! చూచితిని. ఆ చెట్టుకడకైన బోదుగా! పోనిమ్ము చెలీ! నీకీ ప్రయాసమెందులకు?

శం:—(ముఖము చిట్లించి) ఏమే - అట్లుపలికెదవు? నీచేతగానితనము నాయందారోపింతివా యేమి?

చం:—అగును ఆడలేనమ్మ మద్దెల యోడన్నదఁట.

శం:—అగును. నీవంటిదే కాఁబోలు.

చం:—ఏదీ! చూతము నీ బాణవిద్యా ప్రభావము? (అని యొకవంక కుఁజూపించి) ఓసీ! ఆవంకకుజూడుము.

శం:—ఆఁ! చూచితిని. అందేమున్నది?

చం:—దృష్టిదోషమా యేమి? ఏదియో జంతువు నిమరించుచున్నటుల గనుబట్టుటలేదా?

శం:—(చూచి) అగును.

చం:—దానిని గురిచూచి కొట్టుము చూతము నీ ప్రభావము.

శం:—అంతమాత్రము చేతగానిదాననఁటే.

చం:—అది యంతయు నాకు తెలియదు. ముందు బాణము ప్రయోగింపుము. తరువాత చూతము.

శం:—ఇంకఁ జూచెడిదేమున్నది! వ్రేటుతిన్న వ్యాఘ్రమూరకుండునా? అదివచ్చి పైఁబడుసరికి నీటికిఁ దోవజూచుకొనుటయే కదా!

అయిన నిప్పుడే కాలికి బుద్ధిఁజెప్పఁగోనుము (నవ్వి) చెలీ! ఇది
నీకుఁ గ్రొత్తవిషయముగానుదే!

చం:— నేనంత పిరికిదానననుకొంటివా?

శం:— నేనుమాత్రమంత చేతగానిదాననుకొంటివా?

చం:— లేమలే - ముందుగ వ్యాఘ్రమును గొట్టుము.

శం:— వ్యాఘ్రమేకానిమ్ము - పురుషవ్యాఘ్రమేకానిమ్ము నీకాసంది యమెందులకు? ఇదిగో! గురిచూచి కొట్టితిని. (అని బాణము విడుచును. (అది ప్రక్కకుబోవును

చం:—(చప్పట్లుగొట్టి నవ్వుచు) చెలీ! విలువిద్యలో నర్జునుని మించితివిసుమా! ఈ విలువిద్య నెక్కడ నేర్చుకొంటివే? గురితప్పు లేదుకదే - (అని కేరడములాడుచున్నది)

శం:— ఈమాఱు జూడుము (అని ఆవేశముతో బాణమెక్కుపెట్టును)

చం:— ఇంకఁ జాలించుము (అని ఆపి) అది వ్యాఘ్రముగాదు - నీవన్నట్లు పురుషవ్యాఘ్రమే నీబాణాగ్రప్రయోగమును బరీక్షించుటకర్జునుఁడే యీవేషమున శయనించియుండవోవును ఇదిగో! సందియము దీరినదా? ఇటుచూడుము (అని వ్రేలితో శంపకు జూపుచున్నది.)

శం:—(చూచి వెల్లదనముతో) అగునే చెలీ! ఎవఁడో నూతనపురుషుఁడే! ఆవ్రేటు తగిలియుండెనా ఈసరికి............

చం:—(అర్థోక్తియందే) అగును - ఈసరికి నీ ప్రాణేశ్వరప్రాణముపహరించు ముద్దాడుచుండెడివాఁడే-అగునా?

శం:—(చిఱుకోపముతో) ఇఁకనోరుమూయుము. పరిహాసమునకేని బరిమితి యుండవలయును.

చం:-(నవ్వి) పరిహాసమున కాడినపల్కుల కింతటికోపమఁటే?

శం:-అగును. తోడిపరిహాసము ప్రాణాంతకమే.

చం:—(బిగ్గఱగానవ్వి) నాతోడి బరిహాసమా? కాదు, నీయూహా వేఱు.

శం:—ఆఁ, కాకమఱేమి?

చం:—ఏమనియా? వానితోడిఁజెలిమి "ప్రాణాంతమువఱ"కని, అగునా? (అని నవ్వుచున్నది.)

శం:—(శాంతముతో) చంపా! నీవెంతకైనఁ దగుదువే.

చం:—ఓహో! నేనేమిచేసితిని. ఇంక మీరిద్వరేకమై నన్ను దూరము జేసెదరు కాఁబోలు.

శం:—ఇంక నీతో మాటాడను.

చం:—ఇంక నాతోఁబనియేమి?- పోనిమ్ము చెలీ! నీ బాణమున నతని గుఱిసేయుటలోటును దృగ్బాణమేని బ్రయోగించి తీర్చుకొనుము.

శం:—అదిగో మఱల సాగించితివి! పొమ్ము, నీతో నాకు స్నేహమే వలదు (అని పోవఁబోవును)

చం:—(ఆపుచు నవ్వి) పోనిమ్ము, అతని చెంతవిడచిన బాణమేని నీకు వలదా?

శం:—(ఆగి నవ్వి) అబ్బా! నీస్నేహము నాకు సహజబాధకమై పోయినది; అయిన నడువుము. (అని యిరువురు నడుచుచున్నారు).

[అంత నెదుటఁ దెరనెత్తఁగాఁ దలక్రింద విల్లునమ్ములు పెట్టుకొని శ్రమచే నిదురించుచున్న తిన్నఁడు గనుపడును.]

శం:—(బాణమందుకొని తిన్నని యోరకంటఁజూచి లజ్జా వినయ సంభ్రమములు ముప్పిరిఁగొన) చెలీ! ఈసుందరాకారుని యెడఁ దీరని యపచార మొనరించితిమి కదే!

చం:—(తనలో) అప్పుడే! ఈమె వ్యవహారము వేఱగుచున్నది. (పైకి) చెలీ! అగును.

శం:—(శంకించి) సరికాని, ఏదియో ఆలోచించుచుంటివి! అదియేమి?

చం:—ఏమియు లేదు: కాని, యీతనియెడ ననుటకుమాకు "ఈసుంద

రాకారునియెడ" అని చక్కని విశేషణము బ్రయోగించితివి. అందులకే ఆలోచించుచుంటిని.

శ:— ఏమి! ఇతఁడు సుందరాకారుఁడుగాఁడా! యోగ్యులగువారిని అయోగ్యులని పలుకుటలో నది వారియెడ నగౌరవముగాదా? చెలీ- నీమన మెప్పుడును సందియమందే యుండును. దీనికేమి కాని, యిటుచూడుము. (అని అతని చెంతఁగూర్చొని)

మ. అవురా! ఎంతటి సుందరుండితఁడు దే
వాద్యంశ సంభూతుఁడే
యవురా! మానవుఁడన్న నమ్మఁదగునే?
యాయంద; మాచంద మా
దివిజానీకమునందు గల్గుటది సం
దిగ్ధంబుగాదొక్కొ; చి
ర్నవులే వేయివరాలు సేయు, నిఁక వ
ర్ణంబుల్ సుధాబిందువుల్.

చం:— (తనలో) కాముకుల కిదియొకరోగము (పైకి) సందియ మేము న్నది! కాని, చెలీ! నీ వతని లాలించినటుల నిన్నతఁడేలుకొనునా? ముందు వెనుక లాలోచించుకొనుము.

శం:— (ఆవేశముతో)

చం. అరయఁగ నన్ను చేలెడు ద
యాపరుఁ డిద్ధగుణుండు; ధీరుఁడీ
పురుష వరేణ్యుఁడే యనుచు
బుద్ధిఁదలంచెద, నట్లుకానిచోఁ
దిరమగు పౌరుషమ్ము వెను
దీయనిసాహస మొండొరుల్ బరా
బరు లిటుసేయు పేరురము
వహ్వారె! యెవ్వనికేని గల్గునే?

చం:—(స్వగతముగ) తొందమునిరి ఊసరవెల్లియైనది (పైకి) శంపా! నీకుఁ జైత్యము ముదురుచున్నట్లున్నది. ఇప్పటి నీవ్యాపారము నిద్రపోయెడు వాని పాదములకు మ్రొక్కినట్లున్నది. నీకను రూపవరుఁడైనను నిక్కముగ బోయవాఁడేనా ఇతఁడు?

శం:—నీకా సందియమెందులకు?

సీ. బోయఁడుగాని, భూమిభర
ముఁ భరియించిన రాజుగాని; వి
ద్యాయుతుఁడైనగానిక ని
రక్షర కుక్షియగాని బ్రాహ్మణుం
డేయగుఁగా నిఁ నామనము
నీతనియందు స్థిరంబునిల్చెఁ; నేఁ
డేయతనుండు నిర్వరకు
నింతకుఁ బెండ్లిఁ జేసెనేకమై!

చం:—సరియింకేమి! ఆకొంతకూడఁ దీరినది. చెలీ! ఈతడెవ్వఁడని పెండ్లియాడితివే?

శం:—పో!

తే. గీ. ఎవ్వఁడననేల మదనుఁడే యిట్టి ఛిద్ర
శత పరీతమ్మౌ పటము నిశ్శంకఁదాల్చి
తరుణులను లోలహారిణి సంతతిని బట్ట
బోయవాఁడవౌచుఁ దిరుగుఁ గాఁబోలుసతము.

చం:—అబ్బా! ఎంతనంగనాచివే. ఛిద్రశతపరీతమ్మగు పటము కాదు కాదు, చినిగిన వస్త్రము ధరించినంతనే బోయవాఁడు నీపాలిట కప్పుడే మదనుఁడయ్యెనఁటే. చెలీ! ఇంక నీవ్యాధికుదురునట్లు లేదు.

శం:—పోనిమ్మి నీకీబాధ యెందులకు? ఇతఁడు చినిగినవస్త్రము ధరించినవాఁడుకాఁడు. ఏదియో మృగమును పట్టుకొనుచు వచ్చు

టలో శిథిలచేలాంచలుఁడైయుండ నోపు! ఇతఁడొక సంపన్న గృహస్థుఁడనుట కితనిఠీవియే చెప్పక చెప్పుచున్నది. మఱియు నితని పరాక్రమమున కితని విశాల వక్షస్థలమే ప్రబల ప్రమాణము.

చం:—కనుక నే చూచుటతోడనే వరించితివి కాఁబోలు.

శం:—ఆసంగతి నాయంతరంగము నడుగుము.

ఉ. ఇంత వచింపనేల? భువి
నెవ్వనిపై మదినిల్చునో యతం
డెంతయుఁ బ్రేమ పాత్రుఁడగు
నీవిధిఁ గాంతుఁడుఁగాఁగ నీతనిన్
స్వాంతమునందుఁ గోరితి; వి
చారము దక్కితిఁగా 'మనోహిజ
న్మాంతర సంగతిజ్ఞ' మని
యార్యులు పల్కిన పల్కు రిత్తయే?

చం:—(సోల్లుంఠనముగ) అగును నీయట్టివారుండఁగ నెందులకు రిత్తయగును? (నవ్వుచు) చెలీ! నీసాహసము మెచ్చఁదగియున్నది.

శం:—(నవ్వి) ఒకరిమాట యెందులకు? నీపలుకు వృథఁగాకుండఁ జేసితినిగదా! నీవనినట్లు దృగ్బాణమే ప్రయోగించి లోటును తీర్చుకొంటిని

చం:—మంచిపని చేసితివి.

శం:—(అర్థోక్తిమందే) అర్య పుత్రుఁడు లేచుచున్నట్లున్నాఁడు. మన ముచితరీతిని నుపచరింతము. (అని దూరముగ నిలుచుచుందురు)

తిన్న:—(లేచి) చంద్రశేఖరా! చంద్రశేఖరా! నిలువుము (అని నాలుగు వంకలు గలయఁబరికించి వెఱ్ఱివానివలె) నాశంకరుఁడేడీ? నా

ముగ్గుల య్యాయెడ! నాకు బ్రియముఁగూర్చిన పురహరుండేడీ! నాగంకాధరుఁడేడీ? అయ్యో (అని తలమోదుకొని లేచి యిటు నటు బరుగెత్తుచు) హా రా! చంద్రశేఖరా! ఎంత మోసగించితివయ్యా తండ్రీ. అయ్యో! నిన్ను గన్నులారఁ గాంచనైతినే! నోరారఁ బలుకరించనైతినే! చేఁజిక్కిన సొమ్ము నిష్కారణముగఁ బోఁగొట్టుకొంటినే. అయ్యో! అయ్యో! (అని సొలఁబడి విన్నదనముతో)

శా. ఓస్వామీ! నను మోసగించి చనితే
మహోదేవ! యుక్తంబుగా
దోసంబేమి యొనర్చినాఁడ? ననునీ
తోఁ జేర్పఁగారాదె, వి
శ్వాసంబించుక లేదె నాయెడ, విలా
సంబయ్యెనే నీకు, హా
నీ సుట్టంబులలోన నొక్కఁడనుగా
నే? యేల నన్నేఁచెదో.

(అని వెఱ్ఱిగ నిటు నటు చూచుచున్నాఁడు)

శ:—(సంతోషముతో) ఆహా! ఆర్యపుత్రుఁడు పరమభక్తుఁడు.

చ:—(పొల్లుంతనముగ) నీ కన్ని విధములఁ దగినవాఁడు!

శ:—ధన్యురాల నైతిని.

తిన్న:—(నిరాశా భావముతో దేవా! అనుగ్రహము లేదా! తండ్రీ నీవేమన్నను సరియే! నిన్నుమాత్రము విడుచువాఁడనుగాను.

శా. పాలార్పుంచెదో నీటముంచెదవో నా
ప్రాప్తమ్ము నీచిత్త మీ
జాలంబేటికిఁ దావకీయ మగునా
సాక్షాత్కార మిటుంగ; రా

వేలా జాలిగనంగవేల? చలమింకే
లా, పరాకేలనో
నీలగ్రీవ! పరాత్పరా! భవహరా!
నిర్వ్యాజ సంవత్కరా!

(అని భక్త్యావేశముతో నెలపైఁ గూలఁబడి కన్నులుమూసి కొనియుండును)

శం:—(ఉద్వేగముతో) చెలీ! చెలీ! ఆర్యపుత్రు నుద్ధరింపుము.

చం:—అటులే (అని సమీపించి) స్వామీ! మీచంద్రశేఖరుని నేను జూచితిని.

తిన్న:—(కన్నులుదెఱచియుఁ జంద్రికను చూడకయే) అయ్యో! ఇంకెక్కడి చంద్రశేఖరుఁడు! అతఁడు నాకంటి కగుపడునా? లేదు లేదు నాకీప్రపంచమే యంధకారమైనది.

ఉ. ఎక్కడనాడు ప్రాణపదమే
యనఁబోలు సతీమనోహరుం
డెక్కడ నాది ఘోణికెన
యే యననొప్పు వరాహ మింతకే
నెక్కడనుండి వచ్చితి; ని
దేమి యిటుల్ శయనించి నాఁడ! నిం
కెక్కడివేఁట - నాదుసఖు
లెక్కడ; నొంటరినైతి సక్కటా!

చం:—ఆర్యా! మీ రట్టులనవలదు. ఒంటరివారుగారు.

శం:—(చిఱునవ్వు నవ్వును)

తిన్న:—(చూచి ఆశ్చర్యముతో) నీవెవ్వతవు? నీకు మాశంకరుఁడు కనుపడెనా?

చం:— ఆ! కనఁబడెను.

తిన్న:—(ఆశ్చర్యముతో) ఎక్కడ తల్లీ! ఎక్కడ? త్వరితముగఁ జెప్పుము

చం:—(చాతుర్యముతో) అక్కడ (అని యొక చోటఁజూపి భయముతో) అయ్యో! అడవిపంది - అడవిపంది (అని పరువిడును)

తిన్న:—(చూచి ఆవేశముతో) ఓసీ! వరాహమా! నిలు నిలుపుము నీవే నన్నీగతికిఁ దెచ్చితివి! మాశంకరుఁ డొందున్నాఁడో చూపుము నీవే నన్నింతదనుక అలయింపఁజేసితివి. నిన్ను దఱుముకొనివచ్చుటచే జేసి కదా మిక్కిలి అలసి యిచ్చోట శయనించితిని. ఇదిగో! చచ్చితివి. కాచుకొమ్ము (అని శరాసనమ్మలు సారించుచు శర వేగముతో నిష్క్రమించును)

శం:—(ముందునకువచ్చి యుద్విగ్న భావముతో) చెలీ! చెలీ! ఆర్యపుత్రుని గడుదూర మీవరాహము గొంపోవుచున్నది. ఏమి చేయుదును? ఏమి కీడువాటిల్లునో కదా! అయ్యో! ఏదిగతి! ఈజన్మమునకు మనకుఁగల మైత్రి నేటితోసరి. ఈవృత్తాంతము నాతలిదండ్రుల కెటింగించి వారి నూరడించుము. ధర్మపత్నికి ధవునితోడిదే లోకముగదా! కనుక నే ఆర్యపుత్రు ననుసరించెదఁగాక (అని పోవుచున్నది.)

చం:—(విచారముతో) అయ్యో! ఎంతలో నెంతయయ్యెను! పోవుదమ నినఁగాళ్లాడకున్న వే! పోక చేయునదియేమి? (అని మెల్ల మెల్లఁగ నిష్క్రమించుచున్నది.)

— తెర జారును —



ద్వితీయాంకము చతుర్థరంగము

[ప్రదేశము:- ఘోరారణ్యము. అంతట తిన్నడు వ్యాకులమన స్కుఁడై ప్రవేశించి యిటునిటుఁ జూచుచు]

తిన్నడు:—ఓసీ! వరాహమా! నన్నీయడవికిదెచ్చి యదృశ్యమైతివేమి (అని కలయంజూచి హఠాత్తుగ నొకచోట శివలింగమునుజూచి) అహా! ఇదేమి? స్వప్నమందు సాక్షాత్కారమిడిన నాచంద్ర శేఖరుఁడిందు గోచరించుచున్నవాఁడు! ధన్యుఁడను ధన్యుఁడను! (అనివిల్లమ్ములు దూరముగఁ బారవైచి భక్తిపారవశ్యముతో నొరగిలి లింగమును గౌఁగిలించుకొనుచు) తండ్రీ! తండ్రీ! నీవిచ్చోటనుంటివా? (అని పట్టరాని యానందముతో)

ఉ. ఇచ్చటనుంటివే పశుప
తీ! నిను మెచ్చఁగ వచ్చునయ్యా నీ
మచ్చటఁదీరెనా! యిఁక “మ
ముఁగనువారలు లేరటంచు నే
వచ్చెము లేని నన్నిటులఁ
బోవిడి యొంటరినొంచు నయ్యయో!
వచ్చుట భావ్యమానె! అభ
వా! యెటువోదును నేనుమాత్రమున్.

అబ్బా! ఇప్పటికిగదా కన్నులు చల్లనైనవి. ఓ వరాహమా! నీయుపకృతి కెంతయుఁ గృతజ్ఞుఁడను.

తండ్రీ! స్వప్నమందు సాక్షాత్కారమిడిన నీవిపుడు మిన్నకుంటివేమి? రమ్ము కదలిరమ్ము. ఈ కారడవిలోనుండుట నీకిది మంచిది కాదు. (అని నాలుగువైపులఁజూచి) ఔరా! ఏమి! భయంకరారణ్యము (అని పైవంకఁజూచి ఆశ్చర్యపడుచు)

మ. పులులున్ సింగములున్న కారడవిలోఁ బోల్పారు నీజువ్వి, నీ
నిలయంబయ్యెనె? ఎన్ని నాళ్లు సనెనో నీకిందుఁ గూడేది నే
తులతో వంటక మేనొనర్చెదను నా తోఁగూడ మావీటిలోఁ
గలియో గంజియొ త్రాగవయ్య యిఁక వేగన్ రాగదే
లింగమా!

దేవా! ఈపస్తుండుట నెన్నినాళ్ళయ్యె—ఇఁకనైనఁ గరుణించి నాతోఁగూడఁ గదలిరమ్ము కాదేని -

శా. ఏ లీలన్ వసియించు వాఁడవిటఁ? గూడేలేదె- పస్తుండగా
నేలా? మాయుడుమూరి కింతటను రావే దేవ! నేనుండ నీ
కేలోపమ్మనులేదు చెంచెతలు నీకిష్టంబులౌ వండులున్
బాలున్ మీఁగడ లప్పనంబు లటులన్ భక్తిన్ సమర్పింపరే.

మఱియు,

ఉ. ఇంతియకాదు నీకచట నింవగు నివ్వరిప్రాలు బాలతో
నెంతయుఁగూర్చి పాయసము నిత్తును, కమ్మని యాలనేతితో
వింతగఁ బోపువెట్టి వలపించెడు నంజుఁడొసంగ నేరుచున్
సుంతయెఱుంగవయ్యొ! యిటుసూచి వచింపుము నీకులాతినే?

అయ్యో! తండ్రీ ఎన్నిదినంబులనుండి నీవు సయితము లేక అలాడితివోకదా- ఇఁక- నన్నము నోటికి రుచించునా? - రుచింపదు - అయ్యో! పనికిమాలినవాడవైతివే. పోనిమ్ము తండ్రీ! నీ కన్నహితము గలిగించెద లెమ్ము రమ్ము- ఎట్లందువేని—

తే. గీ. వెదురు బియ్యంపుటన్నంబు బదిలపరచి
అన్నహితమున కందు రుచ్యంబులైన
రేఁగుపండ్ల రసంబు బూర్తిగను నించి
కొంచెముగఁ బోపు చుయ్యనిపించియిత్తు.

మాటాడవేమి! నిరపరాధినా- అయ్యో! శరణంటివే! దిక్కు-
మాలిన పక్కినిగదా- తండ్రీ! యింతయేల ఇటువినుము-

శా. నీ సంతోషమె నాకు సంతసము, నీ నిర్వేదమే దుఃఖ మీ
వో సర్వజ్ఞుఁడ, వాదిదేవ! మఱి నేనో మూర్ఖచిత్తుఁడ, నీ
కే సాకల్ వచించువాడనటు రావే- అట్లు గాకున్నచో
నీ సామీప్యమునందు జత్తు నిదె తండ్రీ! నమ్ము మమ్మాటికిన్.

(అని శివలింగమునకు శిరముమోటించి భక్త్యావేశమున సాగిల
పడియుండును. ఇంతలో ననుచరులు ప్రవేశించుచురు)

వీరన్న:—ఓరీ! వెంకన్నా! మన సిన్నపెబువ్వారిందేయున్నాఁడురా-
అబ్బా! వనమెల్ల దిరిగాంగదరా- రారా.. రారా (అని వెంక
న్నతోఁ బ్రవేశించును.)

వెంకన్న:—యాడరా యీరన్నా.

వీర:—అదేందిరా- సాపసుట్టలాగా పడి మెదలకుండా వుండాడురా
పాపము (అని చూపును)

వెం: —అయ్యో బాబోయ్ - యాందో పురుగుముట్టిందల్లేయుందిరా-
(అని సమీపించి) అరే యీరన్నా! యీలింగమేందిరా.
నువ్వు లేపరా యీర్ని.

వీర:—దొరా- లెగండి లెగండి (అని లేవదీయును)

తిన్నఁడు:—(లేచి) ఓరీ! నాభక్తికంతరాయము కలిగించితివిరా.

వీర:—(భక్తిభావముతో) యాంది దొరా-నీమాట నాకద్దమేకాందె!
యీ యవ్వారమేందీ - యీ లింగమేందీ యీ.........

తిన్న:—(శాంతముతో అర్థోక్తియందె) ఓయీ! నాసర్వస్వమే యీ
లింగము. ఇతఁడు నా ప్రభువు. నేనిందేయుండి యీ చంద్ర

శేఖరుని సేవించి తరించెదను. పొండు- పొండు. తలిదండ్రుల కీవార్త తెలుపుడు.

వెం:—అయ్యో! బాబోయ్ ఇంక మేం సచ్చేంవన్నమాటే - ఆపెద్ద దొర సేతులో పడ్డామంటే ఇంక బదకడం యేడది బాబూ? మాపానాలు యిందే పోయితీరాలి - లేదా మీరైన కదలిరావాలి (అని యేడ్చును)

తిన్న:—ఎంకలా రా! నామాటవినుము - పొండు.

పీర:—దొరా! యేంది నీకీయెర్రి? నీకోసము అబ్బో- యీఅడవులన్నీ సుట్టిసుట్టి యీడకొచ్చేమే - యీ లింగం గింగం వదలి కదలి రండిబాబూ (అని విలపించును)

తిన్న:—(కోపముతో) ఓరీ! మీచనువంతకంతకు మితిమీరుచున్నది. నాతోటి నీలింగము కదలివచ్చినగాని నేనురాను - పొండు- ఇంక నావంకకు రాకుడు. (అని బెదరించుచున్నాఁడు)

వెం-పీర:—(కన్నుల నీరిడుకొనుచు) బుద్ధి బుద్ధి - బాబయ్యా బుద్ధి- బుద్ధి మాకర్మంబాబయ్యా లేకపోతే మీసావాసం యింతతొందరలో పోతుందా దొరా? సెలవిప్పించండి. అనుగ్రంమాత్రం ఉంచు బాబయ్యా (అని వంగి జోహారులుచేసి నిష్క్రమించుచున్నారు)

తిన్న:—అబ్బా! ఇప్పటికీ బాధ వదలిపోయినది. (లింగమువంకఁజూచి) దేవా! నీవలనగదా - తంల్లిదండ్రులకునయితము దూరమైతిని. సర్వము దొరంగితిని. సకలము నీవే యనుకొంటిని. ఏమిచేసెదవో (అని కన్నీరు విడుచుచున్నాడు)

(తెరలో)

ఓరీ! మీ చిన్నప్రభుగా రెందున్నారురా?... ఏమనిపలికితిరి? శివలింగమునొద్దనియా, సరి పోయిరండు.

తిన్న:—(ఎదుటఁజూచి ఆశ్చర్యముతో) ఓహో! ఈస్త్రీ ఎవ్వ తెమో త్రోవతప్పికాఁబోలు నీవంకకు వచ్చుచున్నది. ఆహా! మిక్కిలి సౌందర్యవతి, సౌందర్యమునకుఁదోడు సౌశీల్యమును గూడ ముద్దులు మూటకట్టుచున్నది. (అని తప్పుకొనును)

శం:—(పైవిధమునఁ బ్రవేశించి లజ్జతో) ఆర్యపుత్రా!.........

తిన్న:—(అర్థోక్తియందే) ఇదేమి! 'ఆర్యపుత్రా' యని సంబోధించుచు న్నది. (పైకి) దేవీ! నీవెవ్వతెవు?

శం:—(ప్రసన్నవదనముతో) ధన్యురాలనైతిని.

తిన్న:—ఎట్టివిధముగ ధన్యురాలవు?

శం:—(లజ్జతో) ఆర్యపుత్రుఁడు "దేవీ" అని పిలుచుటవలన.

తిన్న:—ఓహో! ప్రమాదవశమునఁ బిలిచితిని.

శం:—(నవ్వి) "ప్రమోదవశమున" అని వచింపుడు.

తిన్న:—మంచిచాతుర్యము నేర్చుకొంటివి! నాకర్థమగుటలేదు ఈనూ తన సంబంధమెప్పటిది? నేను నిన్ను వరింపలేదే!

శం:—లేదు _ నేనే మిమ్ము వరించితిని.

తిన్న:—(నవ్వి) ఎప్పుడు?

శం:—మీరు స్వప్నావస్థయందున్నప్పుడు- నేను జాగ్రదవస్థయందు న్నప్పుడు.

తిన్న:—బాగు బాగు-అయిన- ఈసంబంధమెట్లు స్థిరపడును? అపుడు నా చంద్రశేఖరుని జూపించెదనంటివే- నీవేనా?

శం:—నేనుకాదు నాచెలికత్తియ.

తిన్న:—(నవ్వి) ఆమెకూడ వరించెనా?

శం:— లేదు (అని లజ్జ నటియించును)

తిన్న:— ఇపుడామె యెందున్నది?

శం:— ఆర్యపుత్రుఁడు తన సమాచారమును దలిదండ్రుల కెఱింగింప ననుచరుల నింటికిఁబంపినటుల నేనును మిమ్మనుసరించుచుఁ జెలికత్తియను దల్లిదండ్రుల పాలికంపితిని.

తిన్న:— ఓహో! సర్వము సిద్ధమొనరించుకొని వచ్చితివి కాఁబోలు! కాని, నేను సర్వము సన్న్యసించి పుట్టు సన్న్యాసినైతినే!

శం:— ఆర్యా, మనసారఁ ద్రికరణశుద్ధిగ వరించిన నన్నుఁగూడఁ ద్యజించెదరా? ఇది అన్యాయముగాదా - అగ్నిసాక్షి యెందులకు- ఈపరమేశ్వరుని సాక్షిగ వరించితిని; ఇప్పుడు నన్ను దొఱఁగుట నీశ్వరాజ్ఞ నుల్లంఘించిన వారగుదురేమో- కొంచెము యోజించుకొనుఁడు.

తిన్న:— (ఆశ్చర్యముతో) ఇది ఈశ్వరాజ్ఞయాయేమి!

శం:— కాకున్న మఱియేమను కొంటివి? శివునాజ్ఞలేనిదే చీమయైన గుట్టదందురే - అదియైన వింటిరా?

తిన్న:— అబ్బా! ఇదితీరని సంకెలయైనది. ఓపరమేశ్వరా! ఇది నీవే నిర్ణయించుము. ఇంతీ! నీవాక్యములు సత్యములు గావచ్చును. మనస్సునకు మనస్సేసాక్షియను నీవచన మిప్పటిది కాదుగదా! కాని,

శా. దాగఁబోయినచోట దయ్యములతో దార్కొన్న చందాన దు
ర్యోగంబే మొ! సమస్తముం దొఱఁగునా కో- యిప్డు నీతోడిసం
యోగంబొండు లభించె, సంచితఫలంబో— లేక యీసామి వ
న్నాగంబో- యిది నాచరిత్ర కనుబంధంబౌనొక్కొ- యేమౌ
నొకో!

అని మనంబున సంశయంబొంద వెడిని.

శా. తల్లిన్ దండ్రిని బంధుకోటి హితులన్ ధాన్యాలితో నొప్పునా
యిల్లున్ ముంగిలినెల్లఁ బోవిడిచి యిందేఁ బుట్టుసన్న్యాసినై
ముల్లోకంబులు నేలు నీయభవుసన్మూర్తిన్ దగంగొల్చు నా
కిల్లాలేటికి? నిల్లు లేదె మొదలోయింతీ! వచింపగదే!

శం:—ఆర్యపుత్రా! వచించుటకు మీకు దెలియనిదేమున్నది? ధవుని తోడిదే లోకమని ప్రాణేశ్వరుని కష్టసుఖంబులకు ధర్మపత్ని సమభాగిని యగుట మీరెఱుఁగనిది కాదుగదా?నన్నట్టిదానినిగ భావింపుడు. ఇక నా మనోనిశ్చయంబు వినుఁడు.

ఉ. ఇన్ని వచింప నేల? హరుఁడే ననుఁగూర్చెను నీకు - నాకు నీ
వన్నిటఁ దోడు నీడవు - దయన్ నను నేలుమిఁ కేలి గల్గకా
దన్నటికైన నాయసువులేని శివార్పణబుద్ధి భక్తికై
మన్ననతోడ నిత్తు ననుమాన మికేటికి నమ్ముమో ప్రియా!

తిన్న:—(తలవాంచి అనుమానించుచు) అమ్మో! నీవాక్యములే నీ చరిత్రకుఁ బ్రమాణములు. ఈసంఘటనము బరమేశ్వరున కనంగీకారమేమో!

శం:—(నిశ్చయబుద్ధితో) స్వామీ! అనంగీకారమా? అవసరమగు నేని ప్రాణంబులు సైతము బరమేశ్వరున కర్పింతునంటినే. ఇకను ననంగీకారమా?

తిన్న:—(వంచితుఁడై) దేవీ! లేదు - నీమనోరథమే పరమేశ్వరాను గ్రహమున సిద్ధించును (అనినవ్వును)

శం:—ధన్యురాలను. ఆర్యా, ఇంకను

మ. అనుమానింపగనేల - ఈశ్వరునకై యీదేహ మర్పించుటే
ఘనకార్యం బవకాశముం గలుగనాకల్పంబు వృథంబనై
వెనుకన్నిల్వనె. యింత యేల చితిపైఁబేర్మిం దగంజేరి క్రి
న్నన భస్మాకృతిఁ దాల్చి శంకరుని మేనన్నిల్వనే వల్లభా!

తిన్న:—(మిక్కిలి సంతోషముతో) శబాస్! నీవలన నేనును ధన్యుఁ
డనైతిని. మనమిద్దరమీ పరమేశ్వరుని కైంకర్యమందే ప్రా
ణములు సైతమర్పించెదము.

శం:—మహాప్రసాదము.

తిన్న:—దేవీ! ఇంక నాల్యమేమిటలకు. ఈదేవదేవుని సమక్షముననే
మన వివాహము జరుగవలెను. పరమేశ్వరుడే యాచార్యుఁడు.
సూర్యచంద్రులే సాక్షులు. ఈ ప్రకృతీదేవియే మనల నాశీర్వ
దించు వృద్ధాంగన. ఈకింజల్కములే అక్షతలు. ఈ అవ్యక్త
మధురములగు శుకపికారావములే పుణ్యాంగనా మంగళగీతి
కలు. పరస్పరానురాగ సంబంధములైన మన యంతరంగద్వ
యమే అగ్నిహోత్రము. సంకల్పమే సంధానకర్త. పరమేశ్వ
రుని యాజ్ఞయైనది. ఇదియే సుముహూర్తము. ఇంక విలంబన
మేమిటలకు? రమ్ము (అని పాణిగ్రహణమొనరించి శివలింగము
మెదుట మోకరించి యిరువురు నంజలిబద్ధులై కూర్చుందురు.
పదంపడి యుచ్చైస్స్వరముతో)

శా. ఓస్వామి! విను నీదుకోరికదియేమో యీచెలిన్ భార్యగా
నీ సాన్నిధ్యమునందు గైకొనితిఁ దండ్రీ, యెట్లు రక్షించెదో-

శం:— ఈసౌజన్యుని భర్తఁగాఁగొనుట నీయిష్టానుసారంబుగా
దె- సంసారపునావకింకఁ బతివీవేగాదె గౌరీప్రియా.

(అని లింగముపైఁ జేతులుంచి ప్రమాణముచేయుదురు. ఇంత
లోఁ గోకిల కూయును.)

తిన్న:— దేవీ! పరమేశ్వరుఁడు తన యంగీకారమును ప్రకృతీదేవీమూలకముగ సూచించినాఁడు.

శం:— అగును. దీనివలన నొక విచిత్రమగు భావముగూడ సూచితమగుచున్నది.

తిన్న:— ఏమని?

శం:— ఏమనియా? చూచితిరా. పరభృంతాంగన అల్లదే చూతవృక్షముమీఁద నేకదా నిలయమేర్పరచుకొనినది.

తిన్న:— అగును.

శం:— మనలనుగూడ నా చెట్టుక్రిందనే యొక పర్ణశాలను నిర్మించుకొనమని.

తిన్న:— ఇదియా!(అని భుజముపైఁజెయివైచి) సరియే అట్లేయగును. ముందుగఁ బరమేశ్వరునకిచట నొక చక్కని యాలయము నిర్మించి పదంపడి మనము నిర్మించుకొనెదము. దీనికంతయు నాపరమేశ్వరుడే భారము దనపై వైచుకొనెను. మనమున్ననో కేవలము నిమిత్తమాత్రులము. ఇఁక నడుపుము (అని శంపతో నిష్క్రమించుచున్నాఁడు. తెర జారును.)



3 అంకము  ౧ రంగము

(ప్రదేశము: కైలాసము. సమయము: రాత్రియందలి మొదటి యామము. అంత భవానీశంకరులు పాచికలాడుచుఁ బ్రవేశించు చున్నారు.)

భవాని:—(ఆడి సంతోషముతో) నాథా! నేనే గెలిచితిని. మఱలఁ బందెము వైతునా?

శంకరుఁడు:—అదెట్లు?

భవా.—ఇటుచూడుఁడు.

శం:—అగును- కాని (అని యేమో ఆలోచించును.)

భవా:—(సందియముతో) కాని యేమి?

శం:—ఏమియు లేదు. మనం బన్యాయయుక్తమైనది. (అని లేచి) తిన్నా, మంచిపని చేసితివి; మాతాపితరులకుఁ దరువాతి వాఁడ నేగదా నేను. ప్రత్యక్షదైవములనిన వారే. అమ్మో! నీతల్లి నీకై ప్రాణములు సైతము విడిచినది. తండ్రి యింతకుముందే కళ వయ్యెను. అబ్బా! ఇప్పు డేకాకివైతివి. అన్నా, నీధైర్యము ప్రశంశనీయము. (అని యేదియో ధ్యానము నటించు చున్నాఁడు.)

భవా:—(కనుబొమలు ముడివైచుచు లేచి) నాథా! తిన్నఁడెవ్వఁడు? అతని చరిత్రమెద్ది? వినఁ గుతూహలమయ్యెడిని. (అని మోకరిలి బ్రతిమాలును)

శం:—(భవానితో యథాస్థానమునకువచ్చి) పార్వతీ! ఇతఁ డొక మహా భక్తుఁడు. ఉడుమూరే యితని స్వస్థలము.

భవా:—(ఆలోచించి) ఓహో! నాథనాథుని వలనఁ బందెమ్మున జనియించిన కొమరుఁడా!

శం:—నీకుఁ దెలియని దేమున్నది? అతఁ డిప్పుడు మనమీఁది భక్తిచేఁ దల్లిదండ్రులను సైతము గోల్పోయినాఁడు.

భవా:—పాపమా తలిదండ్రులకితఁడొకఁడే గదా పుత్రుఁడు (నవ్వుచు) నాథా! ఇట్టి యల్లుల నెందఱి నుద్ధరించితిరో!

శం:—దేవీ! నీమాటలు వింతగనున్నవి. ఇతఁడల్లుఁడా! అయిన నింక భర్తఁ డెవ్వఁడు?

శా. తల్లిన్ దండ్రిని గోలుపోయి మతినన్ దైవంబుగా నెంచి తా
నెల్లన్ సచ్చరితంబులన్ గడిపి యెంతే భక్తి నిత్యంబు నో
యిల్లాలా! ననుబూజసేయు నితఁడో నే యల్లుఁ డవ్వేల్పులం
దెల్లన్ జూచిన నిట్టి వాఁడరుదుగాదే నీవు వీక్షించవే!

వలయునేని నితని బరీక్షించెదము.

భవా:—(నవ్వి) నేనుముందుగ శంపయొక్క సౌశీల్యమును జూడఁ దలఁచితిని.

శం:—మంచిది. పందెము వేయుము.

భవా:—అట్టులె (అని పాచికలువైచి) నాథా! ఇదియేమి సమాన మగు పందెమైనది? ఏమైననుగానిండు ముందు పరీక్షనాది.

శం:—సరె! అట్టులే కానిమ్ము

భవా:—అయిన నిప్పుడే పోవుదమా?

శం:—వలదు, పాపమతఁడు మాతాపితృ వియోగముచేఁ జాల ఖిన్నుఁడైయున్నవాఁడు. ముందుగ నొకయుపాయము జేసెదను, అది నీవొనరింపఁ బోవు పరీక్షకు హేతువుగ నుండును.

భవా:—(గ్రహించి) నాథా! మంచి యుపాయమాలోచించితిరి. ఇదియే యిప్పటికి యుక్తము. (నవ్వి) ఎట్టులైన భక్తులనిన మీకుఁ బరమ వాత్సల్యము సుమా?

శం:—(నిశ్చయ భావముతో) దేవీ! సందియమేమి?

తే. గీ. అధముఁడైనను జండాలుఁడైన నిత్య
రోగియైనను దద భావయోగియైన
భక్తి నన్గొల్చువారె నా బంధుకోటి
కృత్రిమపు భక్తినెపుడు గీర్తింప నబల!

భవా:—నాథా! అగును! (అని సాక్షేపముగ)

తే. గీ. భూతభేతాళ భైరవ వ్రాతములును
శాకినీ ఢాకినీ యక్షసంఘములును
బందుగులు గాదె-వచియింపవలెనె? తుదకు
బందుగులు గానివారలెవ్వారు మనకు?

శం:—తప్పేమి? నీవెటుపల్కినను సరియే!

తే. గీ. ఎచట మద్భక్తులుందురో అచట నాదు
వాసమని యెంచు, ఖింతకు వసుధ నాకు
రహికుటుంబిని గాదె మదర్చితలీల
లెఱుఁగదటౌలె హరివిధులేనిఁ దలఁప?

భవా:—నాథా! కోపమా?

శం:—లేదు. వాస్తవముగ వచించితిని. మనముసుకొన్న కార్యమునకు భృంగిని నియమించెదము. నడువుము.

భవా:—అట్టులే (అని నడుచుచున్నారు)

తెర జారును.

తృతీయాంకము.  ద్వితీయరంగము.

(ప్రదేశము— తిన్ననికుటీరము. అంతఁ దిన్నఁడును శంపయును ప్రవేశించుచున్నారు.)

తిన్నడు:—శంపా!

శంప:—నాథా!

తిన్న:—(నవ్వి) ఈ జీవితము నీకెట్లులున్నది?

శం:—బ్రహ్మానందముగ నున్నది.

తిన్న:—స్వర్గమునకంటెనా?

శం:—స్వర్గమున నేమున్నది? "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి" యను నార్యోక్తిని వినలేదా! ఇట్టి పవిత్రమగు నీజన్మభూమియందే పరమేశ్వరసేవ లభించినది. దీనినే యేకాంతసేవ యనవలయును.

తిన్న:—(సంతోషముతో) దీనికిఁ దోడు మహాత్ముల సంగతికూడ లభించిన యుక్తమగునేమో.

శం:—మహాత్మా! ఎందులకుగాదు? సజ్జనసహవాసము ఆనందదాయకము. ఇంతియగాక విజ్ఞానవర్ధకము, అజ్ఞానాంధకారమునకు సూర్యోదయము. అది యలవడెనేని సువర్ణమునకు సౌరభము లభించినట్లే! అదియే కొఱంత.

తిన్న:—అట్లనవలదు. పరమేశ్వరానుగ్రహంబున నదికూడ నలవడునేమో.

శం:—అగును- నా యనుచితసాహసమును క్షమింపవలయును. (అని యొకవంకకుఁజూచి) సిద్ధసంకల్పులరగు మీ వాక్యము మోఘము. అటుచూడుఁడు! జడదారివలెనున్నాఁడు! అయ్యో

మిక్కిలి శతవృద్ధుసుమా- పాపము! తూలుచు నేలకొరిగి నాఁడు. నాథా- నాథా! మీరేగి వారి నిటకుఁ దోడ్కొని రండు. ఉపచరింతము.

తిన్న:—నీవింతలో సపర్యకు వలయు పరికరంబులు సిద్ధముగ నుంచుము. (అని నిష్క్రమించుచున్నాఁడు)

శం:—(తనలో) సర్వము సిద్ధముగనే యున్నవి. (అని చక్కఁబఱచి) ఔరా! ఏమి ఈ తేజఃపుంజము! (అని భక్తిభావమునఁ బ్రక్కన కొదిగి నిలువఁబడియుండును.)

తిన్న:—(వెంటనే జడదారితోఁ బ్రవేశించి) మహాత్మా! మీరిందు మెల్లఁగ నాసీనులుగండు. (అని కూర్చుండఁబెట్టి శంపవంకదిరిగి) శంపా! మార్గశ్రమ నివారణమగునట్లుఁ గొంచెము విసరుము. నేనును బాదములొత్తెదను. (అని అట్లు చేయుచున్నాఁడు.)

శం:—మహాప్రసాదము (అని విసరుచున్నది.

తిన్న:—(ఆదరముతో) స్వామీ! ఎటనుండి మీరు వేంచేయుచుంటిరి?

జడదారి:—చాలదూరమునుండి- కాని- అబ్బాయీ! మీ సపర్యచే మిక్కిలి సంతసించితిని. మార్గశ్రమమును దీరినది. ఇఁక నీవిటు గూరుచుండుము. అమ్మా! నీవు కూడఁ గూర్చొనుము.

తిన్న-శంప:—మహాప్రసాదము (అని యిరువురు ఆసీనులగుచురు)

జడ:—నాయనా! నీవిందేమి చేయుచుంటివి? ఈమె యెవరు?

తిన్న:—మహాత్మా! సర్వము త్యజించి ఈ పరమేశ్వరుఁడే నాకు దిక్కని యిందే యుంటిని. ఈమె ఇ......

జడ:—(అర్థోక్తియందే) ఇల్లాలనియా? సరి! నేను నీ పరమేశ్వరుని జూచితిని. ఆలింగాకారమునందేవియో రేఖలున్నవే. అవియేమి?

తిన్న:—మహాత్మా! తెలియదు. నేనన్ననో మిక్కిలి పనికిమాలిన వాఁడను. మూర్ఖుఁడను. సంశయింపక వాని వృత్తాంతమును నాకెఱింగింపవలెను. (అని దత్తచిత్తుఁడగుచున్నాఁడు.)

శం:—అదియే- ఈ దాసియుఁ గోరుచున్నది: కరుణించి తెల్పుఁడు. (అని వినయము సూచించుచున్నది.)

జడ:— నవ్వి (తనలో) అందులకే యింతదూరము వచ్చితిని (పైకి) బిడ్డలారా! నాకుమాత్రమేమి దెలియును? పరమేశ్వరుని లీల లచింత్యములుగదా! అయినను తెలిసినంతవఱకుఁ జెప్పెదను. పరమేశ్వరునకుఁ గ్రిందిభాగమునఁ జాపల్లినట్లు గీతలేర్పడినవే అది సాలెపురువనుకొనుము.

తిన్న:—(ఆతురముతో) మహాత్మా! సాలెపురుగు నాతండ్రియాదైక్యము జెందినదా? ఎట్లు స్వామీ!

జడ:—తన తంతువులచే నల్లిబిల్లిగనల్లి స్వామికి నీడఁగల్పించుటవలన.

తిన్న:—అంతదనుక ఎండకెండుచు వానకుఁ దడియుచుండెనా? హా! తండ్రీ! నీకెంతగతిపట్టినదయ్యా.

శా. కట్టన్ గుడ్డయులేక కారడవిలో గల్లువ్వి క్రీనీడ నీ
వెట్టో కాలముబుచ్చినాఁడవుగ తండ్రీ! ఎండలోనెండి పై
గుట్టన్ జారెడు వర్షబిందువులు నీకున్ బాధఁగల్పింపఁగా
కట్టా! యెట్లులనుండితయ్య నిను నొక్కండైన పీడింపడే.

(అని వెక్కి వెక్కి యేడ్చుచున్నాఁడు)

శం:—నాథా! ఊరడిల్లు మూరడిల్లుఁడు (అని కన్నులు తుడుచుచు)

జడ:—ఆహా! ఏమి ఈభక్తి! అనిర్వాచ్యముగదా!

తిన్న:—(ఏడ్చుచు) అయ్యో! పరమేశ్వరా! నాఁడెంత అల్లాడిపోయితివో కదా తండ్రీ! నా అన్నవారు లేరుగా తుదకు

తే. గీ. సాలెపురువై నీయెడఁ జాలిదలఁచి
తంతువుల జేర్చి వింతవస్త్రముగ గూర్చి
యెండవానలనుండి రక్షించెగాదె-
(మాటల మాటల ననుకరించుచు) ఛీ! ఛీ!
అట్టి కీటకమైనఁ గానైతి తండ్రి!

(అని దుఃఖవివశతచే నొకప్రక్క కొరుగుచున్నాఁడు)

శం:—(కన్నీరు తుడుచుచు) స్వామీ! మీరేయింత అధీరులైన నింక వేఱు చెప్పవలయునా? లెండు ముందటి కథవినెదము (అని కూర్చుండఁబెట్టును)

తిన్న:—(కూర్చుని) మహాత్మా! తరువాత?

జడ:—ఇటులుండ నొకనాఁడొక యడవియేనుఁగు దన తొండముతో జలాదులను దెచ్చి యర్చించుచువచ్చెను. అంతకుముందే తన మణులచేఁ బూజించుచుండిన సర్పరాజ మొండు కినుకవహించి కాలవైరితమగుట నొకనాఁ డేనుఁగు అర్చించుచుండఁ బొంచి సమయమువేచి దానితొండమందుఁ దూఱెను.

తిన్న:-శంప—(గుండెలుబాదుకొనుచు) అయ్యో! తరువాత తరువాత?

జడ:—తరువాత నింకేమున్నది! తోడనే మదగజము దన తొండమును విదలించి కొట్టుచు విషప్రాబల్యముచే నర్చించుచున్నదగుట నాలింగాకారముననే పడి యసువులుదొలఁగెను. దానితోఁబాటు సర్పమును మరణించెను. ఈసమ్మర్దనముచేఁ దంతువులతో సయితము సాలెపుర్వుగూడఁ గాలగతిఁజెందినది.

తిన్న:—ఔరా! మాత్సర్యము దుదకెంత చేటుఁగూర్చినది?

జడ:—అగును. ఈసంఘటనము చేతనే పరమేశ్వరుఁడు శ్రీకాళహస్తీ శ్వరుఁడని జగద్విఖ్యాతుఁడయ్యెను.

తిన్న:—(ఆశ్చర్యముతో) ఎట్లుస్వామీ!

జడ:—ఎట్టులా! 'శ్రీ'యన సాలెపురుగునకును, 'కాళ' యన సర్పము నకును, 'హస్తి' యన నేనుఁగునకును నర్థములుగలవు. ఈ మూటిని బరమేశ్వరుఁడు దనయం దైక్యము జేసికొనియెను. వాని చిహ్నములే ఆలింగమునం దంకితములై యుండెను. కను కనే యద్దేవదేవుఁడు శ్రీకాళహస్తీశ్వరుఁడని యన్వర్థనామధే యుఁడయ్యెను.

శం:—(ఆశ్చర్యము నటించుచున్నది)

తిన్న:—(వెఱ్ఱిసంతోషముతో) మహాత్మా, ఏమనివచించితిరి? శ్రీకాళ హస్తీశ్వరుఁడా నాప్రభువు. నేటికిగదా! తరించితిని. తరించి తిని. (అని గంతులువైచుచున్నాఁడు)

శం:—స్వామీ! జగదంబ పేరేమి?

జడ:—"జ్ఞాన ప్రసూనాంబ"

శం:—తల్లీ! ఈశుభనామధేయము నీకెంతయుఁ దగియున్నది. (అని భర్తను గనుగొనుచున్నది)

తిన్న:—(గ్రహించి) మిక్కిలి సంతోషమయ్యె (అని భక్త్యావేశ ముతో) ఓపురాణదంపతులారా! నన్ను మీపుత్రునిగ నం గీకరింపుఁడు, నేనన్ననో నీచాతినీచుఁడనుగదా.

మ. తనతోండంబునఁ దెచ్చు నీరముల చేతన్ స్నానమాడించి, పీ
వనఁగాఁ గర్ణములన్ గదల్చి యటుపైఁ బైఁబత్త్రిరిన్ బెట్టి, చ
య్యన లేఁదామరతూడులో యభవ! నీ కాహారంబుఁ గల్పించి
కొల్చిన వేదండమునైనఁ గానయితిఁగా శ్రీ కాళహస్తీశ్వరా!

ఓయీ! గజరాజా! నీ వెంతధన్యుఁడవయ్యా, కాని,

తే. గీ. పడగనున్నట్టి మణులచే భక్తిఁగొలుచు
కాలసర్పంబు శత్రువై క్రాలె నకట!
నీకు, గజరాజ! ఫణియేని నీ వొసంగు
తమ్మిపూలకు హర్షించి తాల్మిఁగనెనె?

శం:—ఇఁకము రెంటికిఁదాలిమి యెక్కడది? ఒకరినొకరు మించిరి అయినను బరమేశ్వరున కీభేదభావమే లేదు.

తిన్న:—కనుక నే తండ్రీ! నీవు సమదర్శివికదా,

తే. గీ. కలహమునఁగాని, శాంతినిగాని, భక్తి
భావమునఁగాని నిన్గొల్చువారి నెవుడు
నైక్యమొనరించుకొనెదవంచరయనైతిఁ
దెలిసెఁ గీటక గజ ఫణుల్ దెగుట నేఁడు!

(జడదారి వంకఁదిరిగి) మహాత్మా! మంచి యుపకారముచేసితిరి, జ్ఞానోదయమైనది. నేనింతదనుక మూఢుఁడను, అవిచారమే చేయనైతిని. ఇంక నీపరమేశ్వరునకేది ప్రియమో వచింపుడు.

జడ—ఓహో! మీరెంతకైనను సర్వసిద్ధులైయున్నారనుట కీసహజ భక్తియే తార్కాణము (పైకి) బిడ్డలారా, ఆలింపుడు. ఈ పరమేశ్వరునకు శవభూతియం దెక్కుడుప్రీతి.

తిన్న:—(వినయముతో) అయ్యా, సహర్షముగ సేకరించి యర్పించెదము.

శం:—ఇది మాకొక వ్రతమే యనుకొనుఁడు. నేఁడే ఆదీక్షఁ గైకొంటిమి.

జడ:—బిడ్డలారా! ఇంకఁబోయివచ్చెదను.

తిన్న-శం:—మాయాతిథ్యము గ్రహింపకయే పోయివచ్చెదమనుచు న్నారే (అని వినయముతో నమస్కరించెదరు.)

జడ:—నాయనా- మీవాక్యములే నాకాతిథ్యములైనవి. మీమనో రథంబులు నెరవేరెడుఁగాక. ఇంక మీరు నిలువుఁడు (అని పోవుచుఁ వనలో) ఇక్కడను భవానీశంకరులయాజ్ఞ నెరవేర్చి తిని. వీరెట్టిపరీక్షలకేని వెనుదీయరు (అని నిష్క్రమించును)

శం:—నాథా! ఇంక నాలస్యమెందులకు? మీరు శవభూతిని సేకరిం చుకొనిరండు. ఇంతలో నైవేద్యమునకువలయు సంభారము లను సిద్ధపఱచెదను.

తిన్న—(నవ్వుచు) దేవీ! నిన్నుఁజూచియే యీవ్రతదీక్షఁగైకొంటిని.

శం:—(భక్త్యావేశముతో) స్వామీ, భయమువలదు అంతకును సర్వే శ్వరుఁడేకలఁడు.

తిన్న:—శంపా! నీవాక్యమే నాకమోఘకవచమైనది. ఇఁక నేగెదను. (అని రెండడుగులువైచి) ఓపరమేశ్వరా! నీవు నాకు ముందు నడువుము. నేనేమియుఁగోరుటలేను. ఈసంతానము నెప్పటి కేని నీయందైక్య మొనరించుకొనుము ఇంతియే.

ప్రామాణ్యంబునకేని లోఁగొనుము శ్రీయన్ సాలెపుర్వున్ మతిన్
బామున్, గాళుని హస్తినిన్ దనువులోనన్ జేర్చుకొన్నట్లు నా
క్షేమస్థైర్య జయంబులారయఁగదే శ్రీకాళహస్తీశ్వర
స్వామీ! నాయెడ దోసముల్ వోఱంగి సౌజన్యంబు చాటింపవే.

(అని నడుచుచున్నాఁడు.)

(తెరజారును)

# దివ్యజ్యోతి

చతుర్థాంకము  ప్రథమరంగము

(ప్రదేశము - తిన్నని చిన్నకుటీరమునకు ముందరి భాగము. సమయము:— రెండుజాముల వేళ. అంత శివలింగము బానుగొట్టముతోనుండును. దేవాలయము శుభ్రముగ నలికి ముగ్గులు బెట్టఁబడియుండును. బిల్వపత్రములతో శివలింగము నర్చింపఁబడియుండును)

తిన్నఁడు:- (ప్రవేశించి చెప్పుకాలితో నిర్మాల్యమును దొలఁగించి పుక్కిటఁబట్టిన జలము లింగమున కభిషేకమొనరించి కుడిచేతియందలి దొప్పలోని శవభస్మము నలంకరించి యెడమచేతియందలి దొంతరగాఁబెట్టఁబడిన రెండుదొప్పల మాంసమును బరమేశ్వరెదుటఁబెట్టి సాగిలపడి నమస్కరించి లేచి అంజలిబద్ధుఁడై)

తండ్రీ! దీనబంధూ!

తే. గీ. త్రోవలనుగాచి పందిని గూలనేసి
పక్వమొనరించి మాంసమ్ము బదిలపఱచి
దొప్పలన్నింపి తెచ్చితి దొనఁగులున్న
సైచి తినుమింకఁ బ్రొద్దయ్యెఁ జంద్రమౌళి.

(అని యాదరముతో దొప్పలలోని కొన్ని మాంసఖండముల దీయుచు మాటిమాటికి దినుమని తొందరించుచుండును. కాని శివుఁడూరకుండ; మిక్కిలి చింతతో) అయ్యో! (అని కన్నీటిని దుడుచుకొనుచు)

శా. ఓసామి! తినకూరకుంటి వదియేమో, త్రోవలఁ గాచి నీ
కోసంబై యిటు కారుపందిని నొకే కోలన్ దగన్ గూల్చి; పే
రాసన్ దొప్పలఁ బక్వమాంసమిడి నీ కందీయఁ గన్నెత్తియుఁ
వీసంబేనియు నంటకుంటి విదియో విశ్వాస మోశంకరా!

తండ్రీ! నేనేమిచేయుదును. ఇయ్యది రుచిగలేదందువా? బాగుగఁ బక్వముగాలేదందువా? ఏమందువు తండ్రీ! అయ్యో! ఎంత యాకలితో నుంటివో! (కొంచెమూరకుండి)

ఏమి తండ్రీ! మాటాడవు. అయ్యో శోషిల్లితివేమో (అని సంకోచించిచూచి నవ్వి) లేదు-లేదు ఏమయ్యా, ఇది నీ స్వభావమా. లేక నా ప్రారబ్ధమా- కాక,

ఉ. దయ్యముపోకనేమొ జడదారులవోలె విరాగబుద్ధి నీ
కియ్యెడఁగల్గెనేమొ! ఇపు డెందుల కెన్నడు లేని నాకటం
బొయ్యన నెంచితేమొ! యిఁక నోగిరమే తిననంచు దీక్షమైఁ
గుయ్యిడినన్ గ్రహింపకయ కోపము దాల్చితివేమొ శంకరా!

(కొంచెమూరకుండి తలపంకించి) ఓహో! తెలిసినది. తండ్రీ! నీవు సర్వజ్ఞుఁడవుగదా! అయిన నీకిట్టిభావ మేలయుదయించె? పోనిమ్ము- నాకడసారి మనవియైనవినుము.

ఉ. కాసును జేయునేరని వికారపుబోయని వందిమాంసపున్
బాసినవంటకంపుఁ గసుమాలము నాకదియేటికంచు నీ
వో సకలజ్ఞ! యెంచితివె, యొప్పనె నీకిది; భక్తిముఖ్యమో
మాసరివ్యక్తి ముఖ్యమొ విమర్శనచేసి భుజింపు మీశ్వరా!

దేవా! నీవేమైననను కొనుము. నన్నీగతికిఁదెచ్చినది నీవేకదా! ఇపుడు కాదనిన బోవుదునా. ముందుగ నా ప్రశ్నమునకు సమాధానమిమ్ము.

మ. నను నీ వేఁటకుఁదెచ్చి ప్రేరకుఁడవై నాచేత నాహారమున్
గొనుటన్ మానితి విద్ధిభోజ్యమును నీకున్ గాదె అర్పైనచో
ననఘా! భోక్తమహేశ్వరయ్య సకలేశా! నిన్ బుధుల్ భోక్తవం
చును భోజ్యంబవటంచుఁజెప్పెదరిఁకన్ శూన్యంబులేయన్నియున్

దేవా! సమాధానమేమందువు? (అని కొంచె మూరకుండి) అయ్యో! అపచారమొనరించితిని అపచారమొనరించితిని క్షుద్రుఁడను నీచాతినీచుఁడను, నేనా- నిన్ను సమాధానముడుగువాఁడను? తండ్రీ తుదకు నానిశ్చయబుద్ధిని వినుము,

మ. ననుమన్నించి భుజింపవేని వరదా నాభాగ్య మీరీతిఁ బం
డెనటంచుఁ దలపోసి నీకిదె యనుష్టేయంబుఁగాఁ బోలునం
చును లోనెంచి మదీయ జీవకుసుమ స్తోమంబు నీ పూజకై
వినియోగింతు 'శివార్పణం' బని మనోవేగంబు చల్లారఁగన్

(అని తనశిరమును శివలింగమునకు మోటించి ప్రాయోపవేశ మొనరింప నుంకించును )

కాళహస్తీశ్వరుఁడు: (తటాలునఁ బ్రసన్నుఁడై కనికరముతో)

కం. అన్నా! లెమ్మిఁక నో
తిన్నా! నిను జూచి మనము ధీరతదోలఁగెన్
వెన్నవలె మెల్లఁగరుఁగ
ట్లన్నా! భుజియింతు సందియం బిఁక నేలా!

(అని లేవఁదీసి కౌఁగిలించి) వత్సా!

చం. అలసితివన్న నీదుహృదయం బెఱుఁగంగఁ దలంచియింతకున్
గలఁచితినన్న! నిన్ను; వృథఁ గాదు పరిశ్రమ మేరికేని నీ
తలఁపు లెఱింగినాఁడఁ దొలుతన్ వ్యథమాని బిరానఁ బక్వపున్
బలలపు ముక్కలొక్కొకటి నాకిడుమయ్య భుజింతు మక్కువన్

తిన్న:— మహాప్రసాదము (అని అందించుచున్నాఁడు)

కా. హ:—(అందికొని నవ్వి) వత్సా! తిన్నా! మిక్కిలి రుచిగనున్నవి, వీనికై యెంత శ్రమపడితివో కదా?

భువినెందేని సతుల్ మనోవిభుల సమ్మోహాబ్ధిఁ దేలింపరే.

శం:—(తలపంకించి ఆలోచించుచుండును)

జ్ఞా.ప్ర:—చక్కని సమస్య. ఇది శంపననుకరించుచున్నది.

కా.హ:—ఏమో! మనల నేల యనుకరింపఁగూడదు? అయినను ఈమె దీని నెట్లు పూరించునో.

జ్ఞా.ప్ర:—(సంకోచముతో) చూచెదముగాక.

శం:—(సంతోషముతో నవ్వి) మహాశయా! పూరింపుమనెదరా?

తిన్న:—(ఉత్సుకతతో) కానిమ్ము (అని అర్ధశాయియై భుజముపై చెయివైచి నిమురుచున్నాఁడు.)

శం:—(నవ్వుచు) వినుఁడు.

మ. భవుఁడంతన్ మది మెచ్చి యట్టులె జగద్భద్రాను సంధాయి నా
టవృథా భైక్షుకవృత్తి మానకయరెంటన్ దేవివర్తింతు నం
చువిశేషజ్ఞుఁడు కౌఁగిటన్ దనిపె నచ్చో గౌరి లాలింపుచున్
భువినెందేని సతుల్ మనోవిభుల సమ్మోహాబ్ధిఁ దేలింపరే

(అని సిగ్గుతోఁ దలవంచుకొనును)

తిన్న:—(లేచుచు) సెహబాస్! బాగుగఁ బూరించితివి. (అనియేదియో ఆలోచించుచున్నాఁడు)

కా.హ:—దేవీ! ఎట్లున్నది; (అని బుజముపైఁ జెయివైచును)

జ్ఞా.ప్ర:—(తొలఁగించి కోపముతో) చాలు లెండు మీసరసములు-నేను మీకేకాక మీభక్తుగాండ్రకుఁ గూడఁ జులకనైతిని.

కా.హ.—దేవీ! కోపమెందులకు? మనచరిత్రములే వీరికిఁ దరణోపాయములుగదా. (అని శాంతిబఱచును)

తిన్న:—శంపా! దీనిచే భవానీశంకరుల లీల విస్పష్టమయ్యెడిని. విన

గుత్తూహల మగుచున్నది. ఆతుర్వగ నాకంతయు నెఱిఁగించ వలెనుసుమా!

శం:—మహాప్రసాదము- వినుఁడు. ఈకథను నాబాల్యమున మాతండ్రివలన వింటిని. ఒకనాఁడు జగన్మాతయగు బాలాత్రిపుర సుందరి వైకుంఠమున లక్ష్మీదేవితో ముచ్చటించుచుండెనఁట.

తిన్న:—(ఆశ్చర్యమున) ఓహో! తరువాత?

శంక:—ప్రస్తావవశమున భార్గవి చిరునవ్వు నవ్వుచుఁ ద్రిపురసుందరిని గూర్చి యిట్లుపలికెను

మ. రమణీ! కోపము జెందవేని హితముల్ రవ్వంత యాలింపు ని
క్కము నీదావన్ బనియేటికిన్? 'భవతిభిక్షాం దేహి' యంచున్ కపా
లముఁ గేలన్ ధరియించి భైక్షుకుని లీలన్ శూలి యింటింటికిన్
భ్రమణంబుల్ దగనల్పునంచుఁ బలుకన్, వారించి సాక్షేపయై.

తిన్న:—సాక్షేపయైన దెవ్వరు? ఓహో! జగన్మాతయా; తరువాత - తరువాత.

జ్ఞా. ప్ర:—(కోపముతో) వింటిరా మన ప్రతాపము.

శంక:—అంత జగన్మాత (భక్తి భావముతో)

మ. అరవిందోద్భవుఁ గాంచి యిట్లనియె- నీయాత్మేశుఁ డస్మన్మనో
హరునిన్ ఋంచినవాఁడుగాడె, యిఁక నీహాస్యంబులున్ జెల్లునే?
'హరయే సంప్రద దేనమే' యనుచుఁ దా నర్పించఁడే భూమి నీ
హరి కానాఁడు సభన్ బలీంద్రుఁడనినన్ వ్యాజోక్తినిట్లాడెఁదాన్.

కా. హ:—దేవీ! చక్కని సమాధానమిచ్చితివి. ఇంక భార్గవికి వ్యాజోక్తికి మాత్రముఁ దావెక్కడిది?

జ్ఞా. ప్ర:—(నవ్వి) మీా చమత్కారముల కేమిలెండు.

శం:—తరువాత లక్ష్మీదేవి యిట్లుపలికెను.

చం. సిరిగలవాని కేదియును జెల్లదె దానముగాని హేయపుఁ
దిరిపెముగాని, దానికయి తీవ్రతఁదాల్చి వివాదమివ్విధిఁ
దరుణి! యొనర్ప నేటికి? యథార్థము చెప్పెద, నాదిభిక్షువం
చిరుదము శూలి కేఁబొసఁగె, నీవది కాదనియన్నఁబోవునే.

తిన్న:—బలే! బలే! భార్గవీదేవి చక్కని సమాధాన మిచ్చినది (అని శంకరుని భావించి) దేవా! నీవు మొదటినుండియు బిచ్చమెత్తుకొనువాఁడవా - తండ్రీ! కనుకనే నీకన్నముకూడఁగఱవైపోయినది. అయ్యో! అయ్యో! తరువాత. తరువాత.

కా. హా- (నవ్వి) తరువాత నేమున్నదోయీ! నాయనా మీయమ్మ లజ్జతో నింటికిఁదిరిగి వచ్చుటయేగదా!— దేవీ —అంతియేనా?

జ్ఞా. ప్రి. (చిఱుకోపముతో) అగును — మీకులజ్జలేదని ప్రతివారికి నంతియేయనుకొంటిరా! ఇఁకఁజాలించుఁడు. పెనిమిటికలిగిం పని పెద్దరికమింతుల కెటనుండివచ్చును?

కా. హా:—సరి- సరి- శంప యేమనునో చూతము!

శం:—నాథా! తరువాతి వృత్తాంతము వినెదరా?

తిన్న—ఆ! కానిమ్ము. కాని మాయమ్మ యెంతనొచ్చుకొన్నదో!

శం:—నొచ్చుకొనుటయేకాదు తుదకాతల్లియే వైకుంఠమువీడి కైలాసమునకు వచ్చినపుడు వినయోక్తిని బరమేశ్వరునితో ముచ్చటించుచుఁ దుదకేగమని చెప్పుకొనినదో వినుఁడు.

మ. అనఘా! భార్గవి మ్రొలసిగ్గిలితి నౌరా! యాదిభిక్షుండవం
చనినీ లోకులు వల్కనోర్తునెటుఁ గుయ్యాలించి సేద్యమ్మిఁకన్
ననుమన్నించి యొనర్పలేరె "కృషితో నహ్యాస్తిదుర్భిక్షమం"
చనునార్యోక్తి నెఱుంగరో యన, భవుండా యింతితో నిట్లనున్

తిన్న:—ఇదిముఖ్యముగ వినవలసినదే— శంపా! పరమేశ్వరునివాక్య మేది?

శం:—వినుఁడు.

ఉ. వచ్చిన వాదు నెప్పటికి వమ్మయి పోదనునట్టి సామెతన్
మచ్చరకేని వింటివె? ప్రమాదము వచ్చిన వచ్చుఁగాక నీ
ముచ్చటఁదీర్తు, ద్రాిడు మతిబొంగర మింతకు లేని నాకు నీ
వెచ్చటనుండి తెత్తు కృషికింపగు సాధనమన్న, నవ్వుచున్.

తిన్న:—తండ్రి! నీలీల లనంతంబులుగదా! ఇంతకుమాయమ్మయేమని నదో!

కా. హ:—నాయనా! ఏమనుటకేమున్నది? ఆడువారి మాటలెప్పుడును గోడఁబెట్టిననట్టులేకదా!

స్వా. ప్రి:—అగునగును. ఆమాటలను మగవారు గొనసాగనిచ్చిరఁ గదా- ఏదిమోయొక యుటంకింపుతో నూహా సౌధమంత యు నెగురగొట్టెదరు.

తిన్న:—ఆ! దేవీ! తరువాత, మాయమ్మ యుపాయమేమేని జెప్పి నదా?

శం:—(నవ్వుచు) చెప్పకేమి! అద్భుతము. ఇదిగోవినుఁడు

చం. హరికడ భూమిఁ గోరుము, దదగ్రజు వేఁడిహలమ్ముఁగొమ్ము,నీ
వర సఖుఁడిచ్చు బీజములు వాహనముండె, యముండు దున్న
నేఁమరకుడు శూలమున్నది, కుమారుడు గావరి; కూడు దేర నే
నిరవుగనుంటిఁగా బశుపతీ! కృషిసల్పు...........

తిన్న:—(వెఱ్ఱిసంతోషముతో) సెహబాస్. మాయమ్మ మాయయ్యను పశుపతీ!!యని సంబోధించినది! దీనిభావము పసులకాపరియనియా—కాదు కాదు. ఓహో తెలిసినది. నావంటిపశు

వులనురక్షించమని - తల్లీ! నీఉదారభావమెంతయు బ్రశంస నీయము. (అని ధ్యానము నటియించును)

కా. హ:—చూచితివా భక్తుడుఁ నన్నెంతవరకుఁ గాపాడినాఁడో.

జ్ఞా. ప్ర:—అగును మీయోగ్యతయే మిమ్ముగాపాడుచున్నది. కాని_ నాథా! శంప నాకెంతయునచ్చినది. ఈమెను బరీక్షింప నామనం బంగీకరింపకున్నది. ఏమిచేయుదును?

శంప:—దేవీ! అట్లనవలదు; తఱచిన నేకదా పాలనుండి వెన్న చేకూరును ఏమందువా—

తే. త్రవ్వినంగాని భూమినేర్పడదు జలము
రాచినఁ గాని శాఖిని రాదువహ్ని
ఒరపిడినిగాని తిలలఁ జేకురదు నూనె
అమిత శ్రమకోర్చినంగాని యశము రాదు.

కనుక నే పరీక్షలవలన సంతానమున బురోభివృద్ధిఁ గాంచఁగలఁ దు. నీవు నీపనియందే యుండుము.

భవా:—అట్టులే! అయిన మీకై యిడిన శవభూతిని హరించెదను. (అని సారబుట్టను హరించి) నాథా! మనము వచ్చినపనియైనది, ఇఁక నడువుఁడు.

కా. హ:—మంచిది, రమ్ము (అని దేవితో నిష్క్రమించుచున్నాఁడు)

శంప:—(నవ్వి) నాథా! మనజీవితకథతోపాటు నీకథయునుముగిసినది.

తిన్న:—(చకితుఁడై) జీవితమును గూర్చి మనకీచింతయేల? చూడు దేవీ! భక్తవత్సలుఁడే భక్తులకొఱకుఁ దాను బిచ్చ మెత్తుకొని జీవించియు మిక్కిలి శ్రమపడుచున్నాఁడు. రమాకాంతునకు లక్ష్మీదేవి అండయుండినటులఁ బరమేశ్వరునకును బరమేశ్వరి యగు నన్నపూర్ణసాయముగలదు. అయినను గడుపార నన్న మే

లేక తుదకుఁగర్షకవృత్తికి సయితము బాల్పడినాఁడు. ఇది యంతయు భక్తులకొఱకే కదా! ఇట్టి మనబోటి పశుప్రాయులను గాపాడకున్న నాజగదీశ్వరుఁడు పశుపతి యెట్లగును? జగన్మాతాపితరులగు నీపురాణదంపతుల పవిత్రజీవితము లోకమున కాదర్శనీయము. కనుకనే జగదీశ్వరున కీవసుంధరాదేవి వసుధైవకుటుంబినియనఁ బ్రఖ్యాతివహించినది. మనము తత్కుటుంబమునకుఁ జెందినవారమగుట - మనకు - మనజీవితమందలి విచారమేకూడదు. జగన్నాటక సూత్రధారియగు భూతనాథుని కనుసైఁగచేతనే భూతధాత్రి, సర్వసస్యములవిలసిల్లి తన సంతానమును నల్లారుముద్దుగఁ గాపాడుకొనుచున్నది. అందులకే వసుంధర "స్వర్గాదపిగరీయసి" అని వేనోళ్లఁ గొనియాడఁబడుచున్నది. ఇంతయును బరమేశ్వరుని లీల లద్వితీయములుగదా! దానిలో నిదియొకటి. చూడు శంపా! ఇఁక వీనిని నేను బూర్తిచేయుదునా?

శంప:—(నవ్వి) చేయుఁడు.

తిన్న:—(నవ్వి)ఇంకేమున్నది? 'పశుపతీ కృషిసల్పు మనంగ గౌరినిన్'

భవుఁడంతన్ మదిమెచ్చి యట్టులె జగద్భద్రాను సంధాయినా
ట వృథాభైక్షుకవృత్తి మానకయ రెంటన్ దేవి వర్తింతు నం
చు విశేషజ్ఞుఁడు గొంగిటన్ దనిపె నచ్చో గౌరి లాలింపుచున్
భువి నేందేని సతుల్ మనోవిభుల సమ్మోహాబ్ధిఁ దేలింపరే.

ఇంతియేకదా!

శంప:—(నవ్వి) ఇందు దప్పులేమేనియున్న ......

తిన్న:—(అర్థోక్తియందే) తప్పులా. భవానీశంకరుల విలాసము లతి మనోహరములు. అందును నియ్యది కడుంగడు చిత్రమైనది.

మై:—అయిన మనకే బాధయును లేదు. ఇక్కడ మా గురుపత్నిని బట్టి చూచినచో నాఁపెయే కొంచెము యోగ్యురాలుగాఁ దోఁచుచున్నది.

గార్గే:—ఇచ్చట మిక్కిలి యుపద్రవమా యేమి? నేనప్పు డిచ్చోట ఒకటి రెండు మాసములే యుంటిని నా కంతఁగాఁ దెలియదు. మచ్చునకొక నాటి ముచ్చటఁ జెప్పుము చూతము.

మై:—ఏమియు లేదు. (అనినవ్వి) కాని వినఁదగినదే. మఱచితిని. మీ గురువుగారు రసికులంటివే ఎట్టిరసికులు?

గార్గే:—(ఆశ్చర్యముతో) నీవసాధ్యురాలవే - వారి రసికత్వముతో మనకుఁబనియేమి? రసికులనఁగా రసగ్రహణపారీణులని యర్థము. అంతియే వారి యోగ్యత. ఇఁక నీకథ సాగింపుము.

మై:—ఎంతచాతుర్యము నేర్చుకొంటివిరా! కాకేమి? చదువునది రసికావతంసులకడఁగదా. ఇంకేమి! నీవును రసికురాలవే. (అని నవ్వుచున్నాఁడు)

గార్గే:—(నవ్వి) అబ్బా! ఏమియు లేదురా మైత్రేయా. వారి రసికత్వమునుగుఱించి నిండుజవ్వనమునాటి యనేక కట్టు కథలున్నవి. కాని మనకు వానితో జోక్యమువలదు. అయినను బోధము చెప్పునప్పుడను భూగోళవిషయములను మనయందిడుకొని యేవియో ప్రస్తావికముగఁ గొన్నిపద్యము లప్పుడప్పుడు చదువుచుందురు. వానిలో నొక పద్యము చదివెదను; దానినిబట్టి వారి రసికత్వము నీవే నిర్ణయించుకొనుము.

మై:—మంచిది. అదియే చదువుము (అని వేడుకపడుచున్నాఁడు)

గార్గే:—అయిన వినుము. (అని గొంతుసవరించుకొని)

చం. శిరమువడంకెరా వయసుఁ జెల్లిన; దృష్టినశించినన్, గురుల్
నెరసిన; మేనరోతలు జనించిన; దంతములూడియున్న; నే
కొఱతయులేదుగాని, "అడుగో మనతాతయె"యంచునవ్వుచున్
దరుణులు మేలమాడిన మనంబడియేమొకో చిన్నవోయెడిన్.

మై:— (విరగబడి నవ్వుచు) గార్గేయా! చంపితివిరా— అబ్బా! ఏమి రసికత్వమురా— అంత ముసలివాఁడైనను 'తాతా!' యనఁగూ తనుగా. అబ్బా! ఏమి ప్రతాపము.

గా:— (నవ్వి) దీనికేమిగాని నీకథ జరుగనీయరా.

మై:— అబ్బా! వినరా. మాగురువుగారు - మీగురువుగారంత రసికులుగారు - కాని యెందుకైన మంచిదే యని యిప్పుడీ వృద్ధాప్యములో ముచ్చటగ వీణ నభ్యసించుచున్నారు.

గా:— ఇంకేమి! వీరును రసికులే— సంగీత సాహిత్యములందు మిక్కిలి పాండిత్యము గడింపవలెనని కాఁబోలు!

మై:— ఏమైన ననుకొమ్ము- కోఁతికిఁ గొబ్బరికాయ దొరకినట్లు గేయింబవేలు దానిసాధనముననే నగిపోవుచున్నది. ఒకనాఁడు "రఘుకులతిలక" అను కీర్తనమును సాధనమొనరించుచుండిరి. పొద్దుపోవుచున్నది- వంటపని ముగించుకొని, పాపము! గురుపత్ని యెంతకాలము గూర్చుండఁగలదు? ఆయమ్మవిసువుతోఁ గూడిన కోపమునకు క్షుద్బాధకూడఁ గొంత తోడైనది.

గా:— ఏమైన నుపద్రవము సంభవించెనా?

మై:— అదేమియు లేదు. (నవ్వుచు) గార్గేయా- ఇంకఁ జెప్పఁజాలను- బాధింపకుము. ఆనాటి క్షోభ భగవారికేని వలదు. అబ్బా- అబ్బా- (అని విరగబడి నవ్వుచున్నాఁడు.)

గా:— (భుజముపైఁ జెయివైచి) చూడు మైత్రేయా- మఱల నా

యమ్మతోఁ జెప్పువారెవ్వరు? భయపడవలదు- ఏమైనదో చెప్పుము- చెప్పుము (అని తొందరించుచున్నాఁడు.)

మై:—(నవ్వి ఆవేశముతో) అబ్బా! నీతొందరకాల- ఇదిగో వినుము. (అని యొకచోటఁ గూర్చుని కఱ్ఱ నొకదాని నొడియందిడి కొని)మా గురువుగారిట్లు వీణను దనయొడియందిడికొని "రఘుకులతిలకా- ఆ - ఆ - ఆ - రఘుకులతిలక" అని మాటి మాటికిఁ బిలక లెగురుచుండఁ దలదిమ్మెత్తువఱకు ఆలాపనము చేయుచుండిరి- పాపము అన్నమే మఱచిరి!

గార్గే:—(నవ్వి) బళే- సామగానమును దన్ను రావణబ్రహ్మ అనుకొనిరి కాఁబోలు. ఆ!- తరువాత.

మై:—తరువాత నేమున్నది? గురుపత్ని ఒకటి రెండు మూఁడు మారులు కేకలు వైచి చూచినది. ప్రయోజనములేక పోయినది. అంత నామె ఆడుసింగమువోలె మండిపడుచు నొక్క-గంతున భర్తపై కురికి—పిలక లంకించుకొనినది.

గా:—(పొట్టబట్టుకొని నవ్వుచు) ఆ! తరువాత నేమైనదిరా.

మై:—అప్పటికిని గురువుగారు రఘుకులతిలకా— ఆ - ఆ - ఆ రఘుకులతిలకా యని యొడలెల్ల ముచ్చెమటలు గ్రుమ్మరించుచున్నను ఆవృత్తిపై నావృత్తి నడిపించుచునేయున్నారు. కొంతవడికిఁ దన పిలకలు నాలుగు అమ్మవారి చేతిలోఁ జిక్కి-నట్లు తెలిసికొని యొకచేతితో వీణను మీటుచు రెండవచేతితోఁ దన పిలకలు నణచిపట్టుకొనుచు బెట్టుసడలకుండ- పాటకు భంగము కాకుండఁ దాళము దప్పకుండ 'రఘుకులతిలకా - వదలవె పిలకా— అబ్బా- రఘులతిలకా - ఆ - ఆ -ఆ - ఆ - అయ్యో - అబ్బా - అబ్బా! రఘుకులతిలకా- వదలవె పిలకా' యని పాపము చాల బాధపడిరి.

గా:—(నవ్వుచు) అబ్బా! ఇంకఁ జెప్పవలదు— మీ గురుపత్ని తాటకిరా- నాయనా- కాని గురువుగారు పాటమానుకొనిరా— అయ్యో- పాపము ఎంత శ్రమపడినారురా.

మై:—పిలకలూడి చేతిలోనికి రానిదే-

గా:—(ఆశ్చర్యముతో) వచ్చెనా-యేమి?

మై:—సందియమేమి? కుమారు సమయమున.— తలయంతయు రక్తమయమే; పాపము! సొమ్మసిల్లి క్రిందకొరిగిరి.— అంత నేను క్రిందఁబడకుండ వీణను మెల్లఁగ దించి గురువుగారి కుపచార మొనరించితిని, సాయంతనమగుసరికి గురువుగారు కొంచెము తేరుకొనిరి.

గా.—అబ్బా! వినుటకే నాకు మిగుల బాధయైనది. ఇంతకుఁ దగిన యన్నములోనికిఁ దగిన శాకమొన్నఁడు లభింపదుగదా.-అంత పండితుఁడై భక్తిచే నెంతయు నొప్పి రెండవ శివుఁడనఁదనబరఁగిన నిమ్మహాభాగున కిట్టి గయ్యాళి భార్య లభించుట మిక్కిలి శోచనీయము కాని యిట్టి సంసారము నిక్కమముగ భూలోకనరక మనవలయును.

తే. గీ. బ్రతికినన్నాళ్ళు గయ్యాళి భార్యతోడఁ
గాపురము జేసి పొందు సంకటముకంటె
వినయమాధుర్య వచన సంప్రీతిఁ దనుపు
పొలఁతితోఁ గాపురంబొక పూట చాలు!

మై:—వాస్తవము బలికితివి. (అని పూజాపాత్రవంకఁ జూచి) ఓహో వేళయైనది. ఇప్పటికీపూలు జాలును. గురువుగారు మనకై వేచియుందురు. ఇంకఁ బోవుదము రమ్ము- -ఈయడవిలో నెచ్చటనో శివాలయమున్నదట. మన గురువుగారచ్చోటికి

నిత్యముబోయి మహాదేవుని నర్చించివత్తురు. ఇది వీరికి సహజ కృత్యమయ్యెను. (అని ముందునడుచును.)

గా:—(మైత్రేయునాపి) ఓహో! గురువుగారే యిటువచ్చుచున్నారు. ఆహా! ఏమి! ఈ బ్రహ్మవర్చస్సు! ఏమి! ఈ ఠాంకము!

ఉ. గుమ్మడిపండువోలె నొక గుండ్రని బొజ్జయు; గుజ్జురూప; వా
స్యమ్మున బ్రహ్మతేజముఁ; బసందగు కుంకుమబొట్టు ఫాలమం;
దిమ్ముగఁ బెండికట్లు దను వెల్లెడ; వీనులఁ గుండలమ్ము; లం
దమ్మగు జందెముల్ గళమునందున నొప్ప గురుండువచ్చెడిన్.

మై:—(త్వరపడి) గార్గేయా! త్వరితముగ రమ్ము. మనమే వారికిఁ బూజాపాత్ర మందీయుదము. అటనుండియే వారికి దేవాలయమున కేగుట సులభము (అని వడివడిగ గార్గేయుని లాగికొని పోవుచున్నాఁడు.)

తెరజారును.

---

పంచమాంకము  ద్వితీయరంగము.

(స్థానము:-పరమేశ్వరుని యాలయము. సమయము పగలు మొదటి యామము. అంత నర్చకుండగు శివశర్మ పూజాసంభారములను గొని ప్రవేశించుచున్నాఁడు.)

శివశర్మ:—(ప్రవేశించి తలుపులుతీసి లోపలికేగి, సెగ్రలు ముక్కులు మూసికొనుచు) శివశివా! భరింపఁజాలను- అబ్బా! భరింపఁజాలను- ఈ దుర్గంధమేమి? (అని నలువైపులు చూచి) ఈ అంట మంగలంబులగు దొప్పలేమి?_ ఈ యనాచారము లేమి? (అని యిటునటు తిరుగుచున్నాఁడు.) ఓ పరమేశ్వరా!

నీకీయనాచారపు రోఁత లంగీకృతములయ్యెనా తండ్రీ! (అని కాలికేదియో మెత్తఁగఁ దగులుటచేఁ జేతితోఁ దీసి వాసనఁజూచి) అయ్యో- అయ్యో- మాంసము- ఛీ! ఛీ! ముక్కు- బ్రద్దలైపోవుచున్నది. పరమేశ్వరా! నీవిందు లెట్టులుంటివయ్యా- అయ్యో- ఎటువంటి యాలయ మెట్టి స్థితికిఁ బాలయ్యెను. (అని రొమ్ము మోదికొనుచు) తండ్రీ! పరమేశ్వరా!

మ. నిను భక్తిన్ భజియింపనెంచి పెరిమన్ నీయాలయంబెల్లఁ జ
క్కని శృంగారమొనర్చి పాల నభిషేకంబున్ దగంజేసి పో
యిన నేఁడీగుడిలోనికీవగిది నిస్సీ! మాంసపున్ దొప్ప లె
ట్లెవ్వని ప్రేరేపణవచ్చెఁ దెల్పఁగదె దేవా! దాఁపనింకేటికిన్.

(కొంచెమూరకుండి) దేవా! ప్రత్యుత్తరమీయవా? లేక— ఇంట్లుంటినని కోపగించితివా? (అని లింగమువంక నిదానించి చూచి విచారముతో) అయ్యో! మాంసమే భుజించితి వనుకొంటిని. అటుగాక నీపై ఈజలము బుక్కిలించిన చారికలేమి?— ఈ నీరు పట్టులు గట్టుట యేమి? తండ్రీ! ఇట్టి రోఁత లెందేని గలవా? ఇంక నూరకుండను. (అని పూజాద్రవ్యములు చూపించుచు) తండ్రీ! గంగాధరా!

శా. ఏనుస్నేతనయుండఁగానొ బదులీవే యింకఁ బంచామృత
స్నానంబేటికిఁ బుక్కిలింతజలమే చాలున్ గదా! మంచి కూ
డే నైవేద్యమదేల మాంసములు లేవే? పెక్కుచందాల నీ
మానావమానములెల్ల నెల్లనె? భవన్మార్గంబు లిప్పాటివే.

తండ్రీ! ఎంత పని కొడిగట్టితివి. నాపై కనికరములేదా? కాక నేనిచ్చు నాహారములు మాని విశుద్ధములగువానిని గైకొనవిచ్చగించితివా- ఏమంటువు? అయినచో - నింక నీసంభారములెందులకు? అని క్షీరాదులను బారవైచు)

శా. నీకో సంబని కాదె సౌరభయుళ్ళన్ని ర్వ్యాజశాల్యన్నముల్,
నీకోసంబని కాదె గంధకుసుమానీకంబు, వేయేటికిన్?
నీకోసంబని కాదె క్షీరములు నెంతేభక్తి నేఁదెచ్చుటల్,
రాకాచంద్రధరా! తలంపవుకదా రవ్వంత నా నీమముల్.

పరమేశ్వరా! నీకీ మాంసములెట్లు రుచించెనయ్యా? విసము
దావిన నోటి కిదియే పాటిది? కాక దీనిని గూడఁ దినిచూడవలయు
నని బుద్ధిఁగలిగెనా? లేక నాయిచ్చు పదార్థములందు రోఁతజనిం
చెనా? ఈ యాగడము మాతల్లి యన్నపూర్ణాదేవి చూచి సహిం
చెనా? అయ్యో! నిన్ను చూడఁగ నాకే నవ్వు గలుగుచున్నది. ఇం
తటి యాకంటి బాధను సహింపలేకపోయితివా తండ్రీ! బిచ్చపుఁగూ
టికన్న నడవిలో నుంటిని గదా "మాంసమేల తినఁగూడ"దని యీ
క్రొత్త పద్ధతి నవలంబించితివా? పోనిమ్ము- తొలుత నా యీసంది
యము దీర్పుము.

శా. ఏలీలన్ భుజియించితయ్యా? పలలంబే నీకుఁ గూడయ్యె నే
నీలీలల్ పరమాద్భుతంబులు ప్రభూ! నీకింతగా నేవగిం
పే లేదేటికిఁ జేతితోఁ గడుపులో నేదేవినట్లయ్యె; నా
కీలోకమ్మును శూన్యమయ్యె నభవా! యెట్లోర్తునీపాడుముల్.

తినినవానికి నీకే రోఁత లేని పక్షమున నింక నాకేల? కంద
కులేని దురద కత్తిపీటకా యేమి? ఓహో నేనింత దనుక వ్యర్థ
ముగఁ బ్రలాపించితిని. నీ నడవడికిని- నీ తీరునకును- నీ భక్తవాత్స
ల్యమునకును- నీ విచక్షణకు ఈ మాంసాహారమే యుక్తమైనది.
ఏమందు వేని?

శా. నీతిన్ జాతియులేని వారియెడ నీ నేస్తంబు; వానమ్మిఁకన్
ఖ్యాతిన్ గొల్చెడు వల్లకాఁడుగద; నీ బేహారమే బిచ్చ; మీ

వో తంత్రజ్ఞుఁడ; వస్తుతే నగలు గావో; పుష్ట్రయె పాత్ర; నీ
రోఁతల్ పెకల్చిటుండవా మాంసము వమికా రోఁతల్ దగఁగల్గునే

దేవా! ఇంతవాఁడ వౌదువని నేను గలయందైన ననుకొన లేదు. ఇంతకు నీవిధికి నేనేమి సేయుదును?

తే. గీ. కట్టవసనంబు లేక చీకాకుపడుచు
బూది మేనెల్లనింతగాఁ బూసి; వల్ల
కాటివసియింతు శుద్ధదిగంబరాయ
భైరవాఁడు వమో యనంబరఁగి యెపుడు.

(అని కన్నీటిని నుడుచుకొనుచు) అయ్యో! పరమేశ్వరా! ఎంత నైచ్యమునకుఁ బాల్పడితివయ్యా! వృథాగా నిన్ను నిందింపనేల, నాకర్మమనుకొనవలెను. (అని కొంచెము రూరకుండి) దేవా! దీనికైన సమాధానమిమ్ము. ఇదియే నాకడసారి ప్రార్థనము.

తే. గీ. ఇట్టిరోఁతలు నీకిష్టమేని దాని
కేమి వచియింపఁగాని నీకెవఁడునతము
నెలమి మాంసమ్ము నీకిటులిచ్చువాని
పేరుదెల్పవె, అదివది వేలునమాను.

(అని యేడ్చుచు భక్తిభావముతో సాగిలఁబడుచున్నాఁడు.)

కాళహస్తీశ్వరుఁడు:— (తోడనే ప్రసన్నుఁడై) నాయనా! లెమ్ము
(అని లేవదీసి) నాకైయెంతగా బాధపడితివోయీ-తండ్రీ!
(అని కన్నీరు తుడుచుచున్నాఁడు.)

శివ:— దేవా! అపరాధములను క్షమించుము — ఏదియో మనోవేద
నచే నోటికి వచ్చినట్లెల్ల వాకొంటిని

కా. హ:— (నవ్వుచు) శివశర్మా! దానికేమిగాని నీవీసమాచారము
వింటివా?

చం. శ్రుతుకమునీజ నీవువిశఁ గోరితివేని వచింతు నింతకున్
స్మృతికి విరుద్ధమానఁడతఁ, డెంచొకఁ డిచ్చుటి కేగుదేరఁ నా
కతిహితుఁడయ్యెవాఁడును, సమంచితభక్తి నొసంగునంజుదన్
మతిగ్రహింతు, నేఁడతస మావెనుకన్ దగనిల్పి చూతువే.

శివ:— (సంతోషముతో) ఆహా! నేఁడుగదా తరించితిని. (పైకి) మహాప్రసాదము తప్పకచూడవలయునని కోరికగూడఁ గలుగుచున్నది.

కా. హ:— చూచెదవుగాక. ఇఁక రెండు గడియలలో నతఁడిచ్చోటికి రాఁగలఁడు. నీవెప్పటియట్ల నన్నర్చించి నైవేద్యాదులొసంగి మావెనుకనే పొంచియుండుము. వానిభక్తి నిగనులారఁ జూచిన నీకే తెలియఁగలను.

తే. గీ. అతనిఁబోలిన భక్తు నేనరయనైతి
ముజ్జగంబులనింత, కోపూజ్యచరిత!
నేఁడుప్రత్యక్షముగఁ జూచినీవ తెలిసి
కొమ్ము నేనొక్క చిద్విలాసమ్మునందు.

(అని యథాస్థితిగనుండుచున్నాఁడు)

శివ:— మహాప్రసాదము! జగజ్జనకుఁడు యథాస్థితిగనున్నవాఁడు ఇప్పుడీ మహాత్ముని నర్చించి భక్తునిరాకకై నిరీక్షింతునుగాక. (అని అట్లుచేసి లింగాకారమునకు వెనుకనిలువఁబడుచున్నాఁడు)

తెరజారును

---

# దివ్యజ్యోతి

షష్ఠమాంకము.  ప్రథమరంగము.

(సమయము:— పగలు కొంచెము ప్రొద్దెక్కియుండును; స్థానము:— తిన్నని కుటీరమునకు ముందరిభాగము. అంత చింతాక్రాంతవదనయై శంప ప్రవేశించును.)

శంప:—(ప్రవేశించి) పరమేశ్వరా! ఎట్టివిపరీతము గావించితివి?— అయ్యో—అయ్యో — శవభూతికానరాదే. (అని చింతిల్లి ధైర్య మవలంబించి) ఇదేమి! నేను దుఃఖించు టెందులకు? అంతకును బరమేశ్వరుఁడే కలఁడు.

తే. గీ. అకట! శవభూతితో నింపినట్టి పాత్ర
కానరాదెట్టి చిత్రంబొ కాని, కల్ల
కపటమెఱుఁగని మావంటి కృపణులైన
సంతతిని గావ కెటులుండు శంకరుండు.

తప్పక రక్షింపఁగలఁడు. భయమువలదు. కాని నిశ్చయముగ నొక ప్రమాదముమాత్రము సంభవించినది. అందులకే ఆర్యపుత్రుఁడు శవభూతి సంపాదనార్థమై పయనమైపోయెను. కాని లభించునో లేదో (కొంచెమూరకుండి) అయ్యో! గుండియ లదరుచున్నవే! హృదయమా! శాంతింపుము. ఆవేదన పొందకుము.— ఎట్లు శాంతించును? హా పరమేశ్వరా - హా పరమేశ్వరా!

ఉ. రాతిరివేళలో మఱపురానియనేక పురాతనంబులౌ
పూతచరిత్రలందగిలి భూతిని భద్రముసేయనైతి నా
వ్రాతయెటుండెనో ధవుఁడు వంచితుఁడై యిటురిక్తహస్తుఁడై
యాతఁడువచ్చెనేని గతియేమిఁక? మాకొక త్రోవఁజూపవే!

(అని యెదుటఁజూచి) అమ్మయ్యో, ఆర్యపుత్రుఁడిటే వచ్చుచు న్నట్టులున్నాఁడు (అని నిదానించిచూచి) కాని యేమిలాభము? - శివ భూతిలభింపలేదు - అయ్యో - అయ్యో - ఇంకేమిచేయుదును? (అని లేచి వెఱ్ఱిదానివలె గంతులు వైచుచు) ఆర్యా! ఆర్యా! ఎంత ప్రయాసపడితివోకదా! నిన్నుజూచి హృదయము దఱుగుకొని పోవు చున్నది — అయ్యో (అని నిట్టూర్పుపుచ్చి)

చ. అడుగిడలేక మిక్కిలి ప్రయాసమునన్ సగమైనమేనితో
నుడుగని భక్తితో ధనువు నొద్దిక మూఁపున వ్రేలఁ, జెమ్మటల్
వొడమిన మోముతో ధవుఁడు వోయినతోవను రిక్తహస్తుఁడై
యెడనెడ నూర్పులున్న గుడ నియ్యెడకే చనుదెంచెనక్కటా!

(ఆవేశముతో) ఇంక జాగెందులకు? నాశరీరమిదే త్యజించి భగవంతునకేను శివభూతినయ్యెదఁగాక. అల్లదే - ఆప్రదేశమునఁ జితిఁ జేర్చుకొనియెదను. (అని రివ్వునఁ బోవుచున్నది.)

తిన్నఁడు:—(వెంటనే పైనసూచించిన విధమునఁ బ్రవేశించి)

చం. పిడికెడు బూదికై యిటులఁ బెన్వగలందితి; నింక నేగతిన్
గడపెద నీమ నయ్యో! యిటుఁ గానలఁ బల్లెలఁబట్టణంబులం
దడుగులు నొవ్వఁగన్ద్రిమ్మఱితి, హా! పరమేశ్వర! ఏమితోఁచవనా !
కడితివా? భారమిపు వహియింపఁగదే యిఁకనైన సత్కృపన్

(అనితూలుచు) అబ్బా! (అని నిట్టూర్పులు విడిచి) దేవా కాత్యాయనీ వల్లభా! ఇంక నొక్కయడుగైన ముందున కిడఁజాలను. నీకు నేటికి శివభూతిగూడఁ గరువయ్యెగా - అయ్యో - దానినెందుల కంత ప్రేమించితివయ్యో - నేను - దీనినే వ్రతముగఁ గైకొంటినే! నేఁడు వ్రతము భంగమగునాయేమి? బాలచంద్రధరా! ఇదినా ప్రారబ్ధమా - లేక - నన్ను నిశ్చయముగఁ బరీక్షింపనెంచితివా? (అని నలువైపులఁ గల యంజూచి) ఏదీ - మాశివ - ఎక్కడ! పాపమీయబల నన్నియథాఁ

స్న(పుటడవిలో దైవముగ నెంచి పూజించుచున్నది- ఆహా! మానవత్వ మెంత పూజనీయమైనది! (అని యొకవంకఁజూచి ఆశ్చర్యముతో లేచి) అదేమి! చితిఁ బేర్చుచున్నది. ఎవరికొఱకు?— ఇంకెవ్వరికొఱకు? పరమేశ్వరునకే — ఆహా! ఎట్టిఘన్యాత్మ్యరాలు.— తనమేని భస్మము సర్పించునుగాఁబోలు! అయ్యో, దేవీ! ఎంతత్యాగమునకుఁ బాల్పడితివి భర్తృగౌరవమును నిలువఁబెట్టఁదలఁచితివా! ఆహా (అని ఏదియో ఆలోచించుచున్నాఁడు)

శంప:—(రివ్వునఁబ్రవేశించి) నాథా! నాథా! (కదలకుండుటఁజూచి) అయ్యో! మాటాడవేమి? ఇప్పటికే జాగయ్యె (అని కదుపుచున్నది.)

తిన్న:—(మేనిపైఁజేయివైచి నిమురుచు) శంపా! (అని కన్నుల నీరుంచుచున్నాఁడు)

శంప:—(దైన్యముతో) స్వామీ! ఊఱడిల్లుఁడూరడిల్లుఁడు. ధైర్యమవలంబింపుఁడు. భగవంతుని యాజ్ఞయైనది. నామనోరథమును నెరవేరినది. నాసహచరీత్వమునకు ఫలముగలిగినది. ఈక్షణభంగుర శరీరమునకు సార్థకత్వముగూడ నొనఁగూడినది— నాకాజ్ఞయిండు—నాకాజ్ఞయిండు (అని తొందరించుచున్నది)

తిన్న:—(ఆలోచించుచుండును)

శంప:—[ఆవేశముతో] మహాభాగా!

శా. ఆలోచింపఁగనేల నాతనువిదే యర్పించి భస్మంబు నిం
దే లాభింపఁగ జేఁయుదానఁ జితి యందే పేర్చితిఁ గాదె యిం
కేలా కాలవిలంబనంబు? హరుఁడే యీరీతిఁ గావించె నే
మో లేకున్న మనోహరా! కలుగునొక్కో యిట్టివైచిత్ర్యముల్!

తిన్న:— (కన్నీటిని గోటమీటుచు) చెలీ! నిక్కువమే వచించితివి. పరమేశ్వరుఁడే యిట్లు గావించెను. తండ్రీ! దయామయా

నీదయ యుట్టిదా! దేవీ! ఈ నిర్భాగ్యుని గట్టుకొని నీవు గడిం
చినదేమి?

తే. ఇష్టులఁ బాసి నావంటి కష్టచరితుఁ
గట్టుకొనితీవు, నీమెడఁ గట్టుకొనిన
ఫలమదేమి వచింపు, మిందులకు శూలి
లయము గావించుకొనెడి ఫలంబుదక్క.

స్వామీ! మీకుఁదెలియని దేమున్నది! ఈ ప్రపంచమే లయ
స్వరూపము. ఎన్నటికేని నాపరమేశ్వరునియందే సర్వము లీనమగును.
ఇఁక మనమెంతవారము. కాని యిట్టి తరుణములభించుట నాపూర్వ
పుణ్యసంచితమనుకొనవలెను. ఇఁక ధైర్యమవలంబించి ఆజ్ఞయిండు—
ఆజ్ఞయిండు (అని తొందరించుచున్నది)

తిన్న:—దేవీ! ఏమంటివి? పూర్వపుణ్య సంచితమనియా—నిక్క
వము—నిక్కవము. నాకట్టిది లేనేలేదు. నీకున్న నీకొద్దియ
వకాశమును నేనేల పాడు చేయవలయును? త్వరపడుము.
నీవలన నేనును తరించెదను. (అని సంతోషము బ్రకటించుచు
న్నాఁడు)

శం:—నాథా! అట్లనవలదు. మీవంటి నిష్కల్మషులరగు భక్తపరా
యణుని జేపట్టినందులకే యిట్టి ఫలముఁజేకూరినది. స్వామీ!
ఆజ్ఞయేకదా!

తిన్న:—(విచారముతో నేలవంకఁజూచి యాలోచించుచుండును.)

శంప:—(ధైర్యముతో) ఈక్షణభంగురంబగు నీ శరీరంబుపై నింత
తీపియెందులకు! ఊరక ప్రాకులాడుట వెఱ్ఱిభ్రాంతి. ఇఁక నాన
తీయుఁడు. పోయివచ్చెదను.

తిన్న:—ఇది—నాసౌభాగ్యమనుకొనుచున్నాను. ఇంక నీ కులదైవ
మును స్మరించి త్వరపడుము—త్వరపడుము.

శం:—ఇప్పటికిఁగదా తరించితిని. (అని యొకచోఁగూర్చొని) కాత్యాయనీ!—లోకపావనీ!

మ. అనుకొన్నంత ఘటిల్లె, నాయసువులే నర్పించి ముక్కంటికై
జననీ! భస్మమొసంగుదాన వ్రతముల్ సంపూర్తినిల్ జెందెఁ దీ
రని మోదంబునుగల్గె; నస్థిర శరీరంబింక సార్థక్యముం
గనె; నాకీభవసాగరం బఁడఁగె దుర్గా భర్గసీమంతినీ!.

తిన్న:—(నిర్విణ్ణుఁడై యుండును)

శం:—ప్రాణప్రియా!

తిన్న:—ఆ! దేవీ!—ఇదియే కడసారిపిలుపు—రమ్ము (అని కౌఁగిలించుకొని బహూకరించుచున్నాఁడు)

శం:—(అంజలి బద్ధయై) మనోహరా!

తే. గీ. మగిడిఁజనుదెంతునో లేదో దిగులుమాని
పోయిరమ్మంచుఁ బంపుమీ పొలఁతి ననఘ!
మఱతునే మిమ్ము జన్మజన్మముల కేని
గడకిదే మీకు నానమస్కారశతము.

(అని పాదాభివందన మొనరించుచున్నది)

తిన్న:—(లేవఁదీయుచుఁగన్నీటితో) సిద్ధమనోరథవైతివి.

శం:—(లేచినిలువఁబడి ధైర్యముతో) ఓ సూర్యచంద్రులారా! పంచభూతములారా! అనుగ్రహింపుఁడు (అని అంజలిబద్ధయై)

తే. గీ. అమలసత్య వ్రతాసక్తనైతి నేని
బతిని దైవంబుగా నెంచుపడఁతి నేని
హరుని మేనికి భస్మంబునగుట కొఱకుఁ
బంచ భూతంబులార! నన్ బంపుఁడింక.

తిన్న:—(వడఁకుచు) దేవీ! ధైర్యము సన్నగిల్లుచున్నది, నీవిపోఁగ మే

సహింతునా? నావిధికై విలపింతునా? హాపరమేశ్వరా! ఈ సమస్యను నీవే పరిష్కరింపుము (అని కన్నీటిని దుడుచుకొనును)

చ. సలలితమాధురీవచన సారసుధారసధారలాని, ని
ర్మలతర మోదమందితి సుమాయని గర్వమునందువాఁడనో
పొలఁతియు నీదు మేనికి విభూతిగనౌనని పొంగువాఁడనో
చెలికయి యేడ్చువాఁడనొయినీ, మది కేమియుఁదోఁపదో విభూ!

దేవా! అంతకు నీవే భారవాహకుఁడ వనుకొంటిని. (అని శంప వంకఁజూచి దేవీ! ఇంక జాగేల భయమందుచుంటి.......

శం:—(అర్ధోక్తియందే) భయమా? మనోహరా? భయమా- ఇంకను భయమా- (అని నిశ్చలచిత్తయై)

మ. భయమిం కేటికిఁ బార్వతీధవుఁడె నన్ బాలించి రక్షింపఁగన్,
భయమిం కేటికి భీతిఁగొల్పుభవమన్ పాథోనిధిన్ దాఁటగాన్,
భయమిం కేటికి భస్మమై శివుని మేనన్ మించి దీపింపఁ గన్
భయమిం కేటికిఁ బ్రాణనాథ యిదె నే పైనంబు సాగించితిన్.

(అని శరవేగమునఁబోవుచున్నది)

తిన్న:—(వెంటనడుచుచు దైన్యముతో) దేవీ! దేవీ! కొంత తడవు నిలువుము-నిలువుము-నిలువుము- అయ్యో! వెడలిపోయితివా? (అని శంపననుసరించుచు విఫలమనోరథుఁడై క్రిందఁబడి తల మోదికొనుచు) హా జీవితేశ్వరీ! నీకప్పుడే నూరేండ్లునిండెనా? అయ్యో— అయ్యో- (అనిమగఖిల్లుచుండును)

(తెరలో) హా! పరమేశ్వరీ! నా జీవితేశ్వరుని గరుణింపుము—కరుణింపుము. నన్నీనెపమున గరుణించి యైక్యమొనరించుకొంటివి. నీ కెంతయుఁ గృతజ్ఞురాలను. కాని

చ. నను రక్షించు దేని కెన్న? జననీ నానాథునిన్ గాచుటే
ఘనకార్యంబుగ దమ్మ లోపమయినన్ గాపాడఁగా నొప్పనం
చును నీనాథునితోడఁ బల్కి; యిటులన్ శోధింప నేలా? దయన్
గనవమ్మా నెవమెన్నకో కనకదుర్గా! భర్గ సీమంతినీ!.

తిన్న:— (ఆశ్చర్యముతో) హా! దేవీ! చిచ్చునందురికియు, నన్ను రక్షింపుమని పరమేశ్వరితో మొరలిడుచుంటివా? నాకర్తవ్యమును జ్ఞాపక మొనరించితివి- నీసాధ్వీత్వమును బ్రకటించుకొంటివి— శంపా- నీయుపకృతి కెంతయుఁ గృతజ్ఞుఁడను (అని యొక వంకఁజూచి) అబ్బా! ఏమి- ఈ మంటలు - ఏమి ఈ మిణుగురులు! ఈ భయంకర దృశ్యమును జూడఁజాలను. (అని మరల నిదానించిచూచి) అయ్యో! అప్పుడే భస్మముగూడ నైతివే- శంపా! నీ వెంతయుఁ గృతకృత్యురాలవు. కాకున్న దేవదేవున కింతలో నీవిధముగ నుపకరింతువే! (కొంచెమూరకుండి) ఇంక విచారింపను- ఇంక విచారింపను. నీ ఉద్యమమును నెరవేర్చెదను. నీ ముద్దు సెల్లించెదను. నీ మేని భస్మమును శివునకు మైపూఁతఁగ నలంకరింపఁ జేసెదను. అలంకరింపఁ జేసెదను- ధన్యుఁడను- ధన్యుఁడను. (అని వెఱ్ఱిసంతోషముతో ముందునకు రెండడుగులు వేయును. అంతలోఁ దెరయెత్తఁబడఁగా భస్మరాసి గనుపించును) ఓ పరమేశ్వరా! నీవు జగన్నాటకసూత్రధారివి. గదా! ఇంత శీఘ్రములో నీవిధముగ మానాటకమునకు భరతవాక్యమును జెప్పితివి. నీలీల లసాధారణములు. అప్రమేయములు- అగోచరములు- ఇంతకు శంప ధన్యురాలయ్యెను! చూచుచుండఁగనే నీయందు విలీనమయ్యెను. ఇంక నాగతియేమి స్వామీ! ఆ సాధ్వి తన మేనిబూదె నీకిడుమనివచించినది. ఇంక నేనన్ననో పూజార్హని. ఆఁపె సందేశమును జెల్లించుటయే నాక

ద్రవ్యము. (అని భస్మ రాశినుండి పిడికెడు బూదెనంది కనుల కద్దుకొని) ఇంక విలంబన మెందులకు! దేవా! ఇదే మీ సేవకరు దెంచితిని. (అని నిష్క్రమించుచున్నాఁడు)

(తెరజారును)

---

షష్ఠమాంకము.  ద్వితీయరంగము.

(ప్రదేశము. శ్రీ కాళహస్తీశ్వరాలయమునకు ముందటి భాగము. సమయము రెండు జాముల వేళ. అంత శివశర్మ విసిగికొనుచుఁ బ్రవేశించి)

శివ:— అబ్బా! కన్నులు కాయలు కాచిపోయినవి. పరమేశ్వరుఁడు వచించిన రెండు గడియలుగూడఁ గడచిపోయినవి. ఇంక భక్తుఁడే కానరాడయ్యెను. (అని యొకవంకఁజూచి) ఓహో! ఇతఁ డెవఁడో భక్తి విలీనుఁడై వడివడిగ నడచి యిటే వచ్చుచున్నాఁడు. వీఁడే యొకవేళ శివుఁడానతిచ్చిన చెంచైయుండనోపు! (అని నిదానించి చూచి) సందియమేమి?

చ. అడుగులఁ గిఱ్ఱు చెప్పులు, భయంబిటు గొల్పెడు విల్లుమూపునన్,
వడువుగఁ బుక్కిలించిన సువర్ణముఖీజలమింక వీఁపునన్
బడినడయాడు నంవహొది, మాంసపుదొప్పలు నొక్క కేలఁబు
ష్పాడియున భూతివేఱొకటఁబొల్పుఁగఁదాలిచి బోయవచ్చెడిన్.

ఆహా! ఏమి! ఈభక్తిగాంభీర్యము. అయ్యాది మానవరూపము ధరించి వచ్చుచున్నట్లుదోఁచెడిని ఇంక జాగుసేయక శంకరుని వెనుక నుండి యితని చర్యలఁ గమనించెదఁగాక. (అని గుడితలుపులు తెరచి లోనికిఁబోయి మరల యథాస్థితిగనుండును.

(అంతఁ బైనని ర్దేశింపఁబడిన విధమునఁ దిన్నఁడు గుడితలుపులు దోసికొని లోనికిఁ బ్రవేశించుచున్నాఁడు.)

తిన్న:—(నిర్మాల్యమును జెప్పుగాలఁదొలఁగించి, పుక్కిలించిన జలముల నభిషేక మొనరించి విభూతి నలంకరింపఁజేసి మాంసపు దొప్పలు ముందిడి) తండ్రీ! పొద్దుపోయినది. క్షమించి ప్రసన్నమతివై దొప్పలనంజుఁడారగించి నన్ననుగ్రహింపుము. (అని సాగిలపడి నమస్కరించుచున్నాఁడు)

శివ:—(తనలో) అబ్బా! ఏమి! వీనిసాహసము! మిక్కిలి మూఢభక్తిగనున్నది. పరమేశ్వరుఁడు నయితమితనికిఁ గట్టుబడినాఁడు. ఔరౌరా! భక్తిమహిమ అనిర్వాచ్యముగదా!

తిన్న:—(లేచిచూచి దైన్యముతో) ఏమిస్వామీ! తినకూరకుంటివి. ప్రతిదినము మెచ్చు విధముననే తెచ్చితినే (కొంచమూరకుండి యాశ్చర్యముతో) దేవా! ఇదియా! నీతలంపు! అబ్బా! ఎంతవాఁడవయ్యా.

చ. తెలిసె భవన్మనోరథము దెల్లముగా నిపుడీ యభాగ్యపుం
బలలము నాకిదేటికని భావనచేసిత్యజించి చేతింయం
దలరెడు లేడిఁగంటిసెగ యందునఁగాల్చిన మాంసమానటం
చలఘుమతిఁ దలంచితె! మృగాంకధరా! భువనైక సుందరా!.

నీకు నీవే యాహారమును సమకూర్చుకొనిన పక్షమున నిఁక మాబోటి వారి కైంకర్యమునకు సార్థక్యతయెట్లు సిద్ధించును? తండ్రీ! భుజింపుము. (నవ్వి) ఓహో! —కోపమా— లేక —ఆలస్యమయ్యెనని కూ— అయిన దానికిఁ గారణములేకపోలేదు. శివభూతిలభింపక పోవుటంజేసి నాసహచరియే తన మేని భస్మము నీకిడినది. కనుకనే కొంత మసలవలసివచ్చినది. క్షమింపవలయును. ఇఁకనైన భుజించినన్ను ననుగ్రహింపుము (అని మరలఁబాదముల పైఁబడుచున్నాఁడు)

శివశర్మ:—(వెఱగుపడి) ఏమిచిత్రముగనున్నది. నాయనా! శివభూతి

నైకె నీసహచరిని గోల్పోయితివిగా, (కన్నీటితో) ఆహా! ఏమి! నీత్యాగము.

తిన్న:—(లేచి దుఃఖముతో) అయ్యో! నావలన నపచార మేమేని సంభవించినదా? తండ్రీ! చెప్పుము- చెప్పుము (అని లింగము వంకఁజూచి) దేవా! అనుగ్రహింపవా! (అని పదార్థములవంకఁజూచి సందియపడి) ఒకవేళ నియ్యవి-

ఉ. మాడెనో కాలెనో పనికి మాలినవో కరుకుట్లు నైజపుం
బోడిమివీడెనో; కసటు వోయెనొ రుచ్యములైతనర్పవో
పాడినపాటలే యనువెవమ్మున నిత్యమిదేల మాంసపుం
గూడని యేవగించితివొ కోపమొ లేక మదీయపాపమో!.

ఉమారమణా! ఎందులకు మాటలాడవు? అయ్యో! బెల్లము గొట్టినరాయివలె నుంటివేమయ్యో! (అని సందియపడి నిదానించి చూచి) ఇదేమి! తండ్రీ! ఈ కన్నీ రేమి! నీకీదుఃఖమేలనో గులకు? కనుక నే నీవు- తినక్కూరకుంటివి. తిను తిను - మని నిన్నెంత నిర్బంధించితి నోగద! ఛీ ఛీ! నావంటిపాపి యీ భూలోకమున నింకొకఁడుండఁ బోడు—ఇంత దుఃఖము కడుపులోఁబెట్టుకొని యెట్లు తిందువయ్యా!

ఉ. అక్కట! మందబుద్ధి నిజ మారయకే భుజియింపుమంచు ని
న్నెక్కుడు దొందరించితిగదే యిటుగన్నుల నీరునించి యే
దిక్కును లేనివానివలె దీనత నేడ్వఁగనేల తండ్రీ! నీ
యిక్కటులేమొ తెల్పఁగదవే యికనైనఁ గృపామతిన్ బ్రభూ!.

అయ్యో! ఇంక నాకేది దిక్కు..? ఏదారిఁబోవుదును? ఏమి చేయుదును? (అని మతిఁజెడినవానివలె నిటునటు తిరిగి మరల శివునిఁజేరి) దేవా! నీవు చిదానంద మయుండవుగదా! అయిన— నీతకు.

ఉ. సామి! అదేమి నీమది ప్రశాంతము గాదె కథావిహీనమై
మోమిటు చిన్నవోయె! భయమో! జ్వరమో! మఱి రోగ
చిహ్నమో!
నీమమొ! కంపమో! హృదయనీరసమో! వ్రశయమ్మొ! గాకిటుల్
నీ మహిమంబొ, యేమయిన విన్విడనాడుదునే జగత్ప్రభూ!.

మఱియు.

శా. నీలే నవ్వులు నీచమత్కృతియు నీ నిష్కావ్రసంగబులున్
నీ లావణ్యము నీదుపొంకమును నీ నిర్వ్యాజవాత్సల్యముల్
నీలావుల్ మఱి నీవిలాసకృతులుల్ నీసొంపు; నీయింపు నీ
శీలత్వంబెటువోయెఁ దండ్రి! యిదియే శృంగారమో శంకరా.

దైవశిరోమణీ! దీనబంధూ! నీకేదియో లోపముగలిగి యుం
డవలెను- నీ వొకవేళ నేదియు లోపము లేదందువేమో కాని నేను
నమ్మను- నేను నమ్మను- ఏమందువేని?

శా. ఏలోపమ్మును లేక కంటికిటు నీరిట్లేవడిన్ గ్రమ్మఁగా
నేలా! నేఁడిదియేమి నీకొదవె తండ్రి! వైపరీత్యంబిఁకే
నాలోచింపఁగఁ బాడియే యసువులే నర్పించి నీ కంటికిన్
పీలామంటలు గూర్చువాఁడనిదె నిర్వేదంబు నీ కేటికిన్.

దేవా! తప్పక నీకౌషధంబులు పనుకూర్చెదను; ఏమి! నీదాసుఁ
డంతటి యసమర్థుఁడనుకొంటివా- లేక నిన్ను విడిచిపోవుదనుకొంటివా?
లేదు-లేదు తండ్రీ! నీదయగలదేని.

ఉ. ఆవిరిఁ బెట్టి కంటి కొనయందునఁ జేరిన నేయి వెట్టి; యా
పైవడిఁ జల్లడించెనపుఁ బల్చని పూల రసంబునించి, మే
లౌవిరులట్టు, నిమ్మరసమానుచుఁ దంగెడ పత్రినూరి, పైఁ
బెవలిపట్టు వెట్టి, చను ఘాలను రాచి చికిత్సఁజేసెదన్

(అని వెట్టిహాసవలెఁ బరుగెత్తుచున్నాఁడు)

శివ:—(ముందునకువచ్చి) అబ్బా! వీఁడెంతకైనఁ దగినవాఁడే! పరమేశ్వరా! నీ లీలలనంతంబులుగదా! ఇంక వీనిని బరీక్షింపకుము. ఇప్పటి వీనిచర్యలే యితని భక్తికి మిక్కిలి వన్నెఁబెట్టుచున్నవి ఇంతకన్న వేఱు ప్రమాణమువలయునా! (అని యెదుటజూచి) అదుగో! బోయవాఁడేదియో మూలికలుగొని వచ్చుచున్నాఁడు. ఇఁక నేను యథాస్థితిగ నుందునుగాక (అని అట్లు చేయుచున్నాఁడు)

తిన్న:—(వెంటనే మూలికలతోఁ బ్రవేశించి) తండ్రీ; కొంచముతాళుము (అని తాను తెచ్చిన మందులన్నియుఁ బ్రయోగించి) అబ్బా! ఇప్పటికిఁగదా! నీకు కొంచెముగట్టుపడి ముఖము ప్రసన్నమైనది. (కొంచెమూరకుండి) ఏమిది? అయ్యో! నేను వ్యర్థముగఁ బ్రమాదమొనరించితినా యేమి? మరల నీయుపద్రవమేమి? అయ్యో! శంకరా! దయలేదా (అని తలమోదికొనుచు)

శా. ఓసామి! యిదియేమిచిత్రమొకో దుర్యోగంబు ప్రాప్తించెఁగ
ట్టా! సెల్లెన్ సకలౌషధంబు లిఁకనీటన్ వ్రాయు చేవ్రాలనన్
వీసంబేని బ్రయోజనం బకటా! లేనేలేదు పోనీ రసా
భాసంబైయిటు నెత్తురుల్ బొడముటేభావంబుకో శంకరా!

దేవా! దీనదయాళూ! ఎంతవాఁడవయ్యా! తండ్రీ! ఎంతవాఁడవు? నీకు నీవే తగుదువు. కన్నీరు నిలిపి రక్తము ప్రవహింపఁజేయుదువా- అబ్బా! ఏమి నీచాతుర్యము! వాస్తవముగ నీకీవ్యాధి యుంకురించెనా- లేక- నామనంబెఱుఁగ నిట్లొనరించుచుంటివా - ఉమారమణా! నిన్ను— నావంటి యమాయకుఁడ వనుకొంటినే- నీకొఱకే సర్వమర్పించితినే- చంద్రమౌళీ! వలచి ప్రేమించి రేయింబవలు నన్నే దైవముగకొని సేవించిన ప్రియురాలి యొతలిభస్మంబు

ను నీకంగరాగంబుగ నిడితినే- ఇంతయేల నాప్రాణంబులు సహిత మర్పింపఁదలచితినే— తండ్రీ! ఇంతనిర్దయుఁడవా!- నీలకంధరా— నిన్ను పండితులు సర్వసులభుండని చెప్పెదరే- అదియెంతయుఁ గల్లయయ్యెనా యేమి? - లేక— నీవు శంకరుఁడవేకాదా- నేనే పొరబడి మాయామోహపముత్రోనుండిన నిన్ను జగజ్జనకుఁడవని భావించి సేవించుచుంటినా- పార్వతీప్రియా!- నాఁడు సముద్రము మథించుతఱిఁ గల్పవృక్షాదులు బయల్పడినప్పుడెవరికి నేపదార్థములు వలయునో వాని నల్లఁగొల్లలుగ గ్రహించి ప్రత్యేకించి విషము నీకొఱకేర్పరచినదానిని మహాప్రసాదంబని కనులకద్దుకొని గ్రహించితివే- కడుపార భుజించితివే— జీర్ణించుకొంటివే. ఇప్పుడు నేనట్టి విషమేని నారగించుచుంటినా? లేదే- చిఱ్యపట్టికొప్రివ్విన నడవి పందిని గోలఁగూల నేసి రుచిచెడకుండ బల్లెము పైనునిచియే కాల్చి పేల్చితీసికొని వచ్చితినే నా మాంసమా విషముకుఁదీసిపోవునా? లేక అప్పటి యమాయికుండవగు శంకరుండవిప్పుడు గాదా! చంద్రకళాధరా! విషభక్షకుండవగు నీ మనంబిపుడు కేవలము పాషాణమయ్యెఁగాఁబోలు. కాదు-కాదు— నీ వెప్పుడును మంచివాఁడవే- నిన్ను వృథాగా నిందించుటెందులకు? కాత్యాయనీ వల్లభా! నిన్నేమైనఁ బెట్టుమని ప్రతిమాలితినా— పోషించుమంటినా?- ఎట్లందును? మొదలు నీకన్న మేలేదే! ఆదిభిక్షుండవగు నీవు నాకన్న మెటనుండి తెచ్చిపెట్టెదవు? (కొంచెమూరకుండి) ఓహో! నేనేపొరబడితిని- పొరబడితిని- మాయమ్మలు గయ్యంబునకుఁ గాలు దువ్వినవారిని జక్కఁబట్టుకొనుచుంటివి కాఁబోలు. అయిన- నేనెవడను? తండ్రీ! నీకుటుంబమునకుఁ జెందనివాఁడనా? ఇంక నాగోడేల యాలకింపవు? ఆర్తత్రాణపరాయణుండవని చెప్పెదరే- మిథ్యయేనా! దేవాదిదేవా! ఇట్టి నిన్ను రావణాదులెట్లు సేవించిరయ్యా- అతఁడు నీకైలాసమెత్తినప్పుడు గడగడలాడితివే- తల్లడిల్లితివే- దిక్కులు

బరికించితివే- ఇప్పుడేమైన నట్టియుపద్రవము సంభవించెనా? లేక- వారికి భయపడి నీవేపెద్ద వల్లకాటనైనన వసింపఁబోయితివా- తండ్రీ! పలుకవేమి!- అయ్యో మోసపోయితిని. నీవిటిస్థానువని యెఱుంగక పోయితిని. మొదలే చెడితిని. పుట్టుసన్న్యాసినైతిని. అటుసంసారినిగాక ఇటు సన్న్యాసినిగాక రెంటికిఁజెడిన రేవడినైతిని. కొందఱు జడదారులు నీమహిమ నెంతయో కొనియాడెదరే- వారికి నీవేమైన లంచమిచ్చితివా! కాకున్నఁ- గొనియాడుటకు నీవద్దనేమున్నది? దిగంబరుండవు! గదా! బట్టపాచ్చరలేదే- సురసందోహవందితపాదారవిందా! ఉమానాథా! తినుటకుఁగూడేనిగలదా! ఉండిన విషమేలమెక్కెదవు? దేవా నీవేపమేయమంగళము! ఇట్టినిన్ను సర్వమంగళ యెట్లు ప్రేమించెనయ్యా! పీనుఁగుల పెంటయనఁదగు నా వల్లకాట నెట్లుశయనింతువయ్యా! అయ్యో! మనుజుని పుఱ్ఱెలో భుజించువానికి శ్మశానమొక లెక్కయా! శంకరా! తేరగవచ్చినవని- పాములమెడ వ్రేలాడవైచుకొని తగుననమ్మయని బక్కయెద్దు నొకదాని నెక్కి- భూత ప్రేత పిశాచ ఢాకినీ యక్షరాక్షస గణంబులు వెంటనడువ మాయమహారలు నవ్వ శుద్ధదిగంబరాయ భైరవాయనమోయని వందిమాగధులు కైవారములుసేయఁ గులుకుచు నెట్లు తిరుగుచుందువయ్యా! గంగాధరా! బాలచంద్రుఁడు దలపైనుండి యమృతము జిలుకుచున్నను, మాతల్లి గంగాదేవి సకలోపచారములు చేయుచున్నను- నింక అన్నపూర్ణాదేవి మధురంబులగు షడ్రసోదంచితంబులగు రాజాన్నములనిడినను నీహృదయమింతలో నింత పాషాణమెట్లయ్యెనయ్యా! నీకుంగావించిన యుపచారంబులన్నియు వెల్లఁగరిసిన చింతపండు చందంబయ్యె – ఇట్టినిన్ను సేవించిన నాకుఁదుదకిట్టి ఫలకంబు ప్రాప్తించె పరమేశ్వరా! నీవెట్టివాఁడవైన నగుదువు నాకు దానితోఁబనిలేదు. కాని నాతుది మాటవిని (అని ఆవేశముతో)

శా. కానిమ్మెంతటికష్టముల్ బొదలఁగాఁ గావించెదో చిత్రముల్
నీనిర్వ్యాజకృపాకటాక్షమిటు లెంతే నావయిన్ గల్గ నా
కేనాఁడేని భయంబుగల్గునొకో విశ్వేశా! తలన్ ఱోట జం
కేనిన్ లేకయ దూర్చి ఱోఁకటికినై యెవ్వాఁడు భీతిల్లెడున్?

తండ్రీ! నాకేవిషయమునందును గొఱంతలేదు. నీయందైక్యము గాకపోయితినే యని చింతమాత్రము గలదు. ఇప్పుడందులకుఁగూడ సర్వసిద్ధుఁడనై యుంటిని. నాకొకసారి ముద్దును జెల్లింపుము. (కొంచెమూరకుండి) అయ్యో, నిన్నెంత దూఱితిని. ఎట్టి కఠినపు వాక్యముల నీ మనముగలఁతబఱచితిని! దీనదయాళూ! నాయపరాధములు క్షమించి యిప్పటికేని యెప్పటియట్లు ప్రసన్నరూపమున నలరారుము. ఈ భయంకరాకారమును జూడఁజాలను. ప్రసన్నుఁడవుగమ్ము. (కొంచెమూరకుండి) ఓహో! తెలిసినది. దేవా! ఇదియా నీభావము? నీయౌదార్యమున కెంతయుఁ గృతజ్ఞుఁడను. నన్నిబరీక్షయందుఁ గృతార్థునిగఁ జేయఁదలఁచితివి కాఁబోలు! నీసంకల్పమిదియా! తండ్రీ! నీవాత్సల్యమెంతని కొనియాడెదను? వ్యర్థముగ దీనికింత మసలితినే. అయ్యో- నే నీవఱకు నాభగవంతుఁడు నన్ననుగ్రహించియుండఁడనే- ఇంకఁ దడవొనలను- ఇదిగో నా సర్వస్వమర్పించితిని. (అని ఉచ్చైస్స్వరమున) శంభో! దీనదయాళూ!

మ. తెలిసెన్నిదు కృపావిశేషమున నో దేవా! ముగంబయ్యో న
న్నులికింపంబనియేల నావలనఁగాదో యుష్ణ ముష్ణేనశీ
తలమన్ సామెత నేనెఱుంగనిదె! నాథా! కంటికిన్ మందు గ
న్నిలఁ జూకింపను వేఱు మందుగలదే యెచ్చోటఁగాలించినన్.

ఇదే మొనఁదేలిన బాణమ్మున నాకంటిని బెకలించి సమర్పించెదను. (అని యంబుల పొదినుండి బాణమొకటి తీసికొని పెకలించి

యీశ్వరున కర్పించుచున్నాఁడు.)

శివశ:—సెబాస్ దేవతలకేని వెఱపుఁగల్పించు చర్యలతోఁ గూడిన నీతని భక్తి యెంతయుఁ బ్రశంసనీయము. ఓయీ! నీవింకఁ గృతార్థుఁడవైతివి!

తిన్న:—(తన కంటి నెత్తురొత్తుకొనుచు) దేవా! ఇప్పటికి గదా నీప్రశాంతమగు స్వరూపమును జూడఁగలిగితిని. కన్నులపండువైనది-అయ్యో! యీ యాలోచన నాకు మొదటనే యేలతోఁచదయ్యె! తండ్రీ! ఎంత బాధపడితివోకదా! (అని పరమేశ్వరుని కంటిని దన చేలాంచలముతోఁ దుడుచుచున్నాడు. తోడనే శివుఁడీమాఱు దన కుడికంటికి నీరు గ్రమ్మినట్లు జేయఁగాఁ దిన్నఁడది చూచి యదిరిపడి) దేవా! మఱల నిదియేమి? (సంతోషపారవశ్యముతో) ఓహో! ఈమాఱు గుడి కంటికా వ్యాధి గుంకురించినదా! (నవ్వి) అట్టులే. యంకురించును. కాని తండ్రీ! ఈ గయ్యాళితన మెక్కడ నేర్చుకొంటివి?

శా. బొలెమ్మింకటఁ జాలుచాలు పరసంబా! వేలుకన్నులవలిం
కేలా నాకుఁ భయంబు కాచనిపరీక్షింపక మదిర్ఘోరిరక
ఘాలంబందలికంటి మంటలకు నాప్రాణంబులర్పింతునో
నీలగ్రీవ! పెకల్చి కన్నిపుడిదే నీకిత్తు నిష్పట్టురక

(అని తొల్లింటి విధమున బాణముతోఁదనకుడి కంటిని బాణముతోఁ బెకలింప నుద్యుక్తుఁడై చెప్పుకాలతో లింగాకారముయొక్క కుడిభాగమున గుర్తుగ నొక్కికన్ను పెకలించు చుండును. ఇంతలో లింగాకారము భిన్నమై పెద్దధ్వనితో జ్ఞానప్రసూనాంబతోఁ బరమేశ్వరుఁడు సాక్షాత్కరించుచున్నాడు. శివశర్మ అదిరిపడి ముందునకు వచుచున్నాడు)


శా. హ:—(హాస్య విన్యాసమొనరించుచును హెచ్చుస్వరమున)

శా. కన్నప్పా! నిలునిల్వు మింకసుజనైక శ్రేష్ఠులన్ మిన్నవై
తన్నా! తిన్నఁడవీవుగా నిటులు గన్నర్పించుటం జేసి యే
కన్నప్పంచును దిక్కులెల్ల వెలుగం మించి సత్కీర్తిచే
నన్నింటన్ భువివృద్ధిఁబొందు మిదె నీ వాచంద్ర

[తారార్కమున్.

(అని తిన్నని చేయిఁబట్టుకొని చిఱునవ్వుతో)

నాయనా! కన్నప్పా! ఇంక నీయుద్యమమును జాలింపుము. నీవు నాకిడిన దృష్టికి మారుగ దివ్యజ్యోతిని బ్రసాదించెదను. (అని తనపవిత్ర హస్తముతోఁదిన్నని యొడలునిమురుచు) వత్సా! ఇటు చూడుము- నీకు

శా. దివ్యజ్యోతి నొసంగినాఁడ నిటుపైఁ దేజోభిరాముండవై
దివ్యుల్ నిన్ గొనియాడ భక్తివశతన్ దీపించి వర్ధిల్లుమో
భవ్యాత్మా! వచియింపఁగావలెనె నీబంధంబులున్ దీరెగా
దే వ్యర్థంబె సను నే పరిశ్రమము తండ్రీ! భక్తచూడామణీ.

(అని బుజ్జగించుచున్నాఁడు)

కన్నప్ప:—(దివ్యజ్యోతినలరారి) ఆహా!ఏమి! నా భాగ్యము! పురాణదంపతులు సాక్షాత్కరించిరి! జగన్మాతా పితరులగు మీకు మీ తనయుఁడర్పించు వందనంబులందికొనుఁడు (అని యిరువురకు నమస్కరించుచున్నాఁడు)

శా. హ:—వత్సా! లెమ్ము (అని లేవఁదీయుచున్నాఁడు)

జ్ఞా. ప్ర —నాయనా! చరితార్థుఁడవైతివి.

కన్న:— మహాప్రసాదము. (అని అంజలి బద్ధుఁడై భక్తిభావమున)

(దండకము)

శ్రీమన్మహా దేవ దేవాదిదేవ త్రిలోకైకనాథా! రమానాథ సంభావ్యసత్పాదరాజీవ! దివ్యప్రభావా! మునీంద్రాది బృదారకవ్రాత

సంస్తుత్యా! సత్కీర్తిజీవా! భవత్పాద పంకేరుహాసక్త పీయూషముఁ గ్రోలి దుర్వార సంసార పాథోనిధిఁ దాటి వైరాగ్యముఁ జెంది మానుల్ మహానంద మొప్పార నిర్వాణసౌఖ్యంబులుఁ జెందరే! నీవు లోకోపకారంబుగా నాఁడు హాలాహలంబెల్ల ముల్లోకముల్ బెల్లుగన్ ధ్వంసమై పోవునేమోయనఁ జాలి పాల్పడ్డ విధంబునఁ గ్రోలి రక్షింపవే- దుష్టులఁ గూల్పవే శిష్టులఁ గావవే! సూర్యచంద్రుల్ రథంబందు చక్రంబులై యొప్పఁగా స్యందనంబే మహాదేవి గాఁగఁ ము రారాతియే నీకు బాణాగ్రమై యొప్ప నీవున్ బురంబుల్ మహాక్రోధ మేపార దగ్ధంబుగావించి లోకంబు రక్షింపవే తండ్రి! నిన్నెంచ నే నెంత వాఁడఁ దయఁ బ్రోవవే యింక దీనుఁ దురాచారుఁ భీరుఁ ననుఁ దీనచింతామణీ! పాహిమాం పాహి శంభో! నమస్తే నమస్తే నమః.

(అని పాదాభివందన మొనరించుచున్నాఁడు)

కా. హ:—(ప్రసన్నవదనముతో) నాయనా! ఇంకఁ జాలు లెమ్ము.

(అని లేవదీయుచున్నాఁడు)

కన్న:—(లేచినిలువఁబడి భక్తిభావమున నొకప్రక్కకొదుగును)

కా. హ:—(చిఱునవ్వునవ్వుచు) శివశర్మా! నీసందియముదీరెనా?

కం. మతిఁ బరికించితె భక్తుని
హితుఁడే గద మనకు నితఁడిఁకేటికి నీ స
మ్మతి కేని వచ్చెనే చెపు
"మతి సర్వత్రవర్జయే"త్తని వినవే!

శివశర్మ:—(సంతోషముతో) దేవా! తరించితిని. మిక్కిలి సంతోషమయ్యె! ఇంతకు మీలీలలనంతంబులుగదా! (అని పాదముల పైఁబడుచున్నాఁడు)

కా. హ:— (లేవఁదీయుచు) శివశర్మా! ఇంక నీధన్యు ననుసరించెదవా!



శివశర్మ:—(భక్తిపారవశ్యముతో) భక్తవత్సలా! సందియమేమి? నిక్కువముగ ధన్యుఁడే యితఁడు. ఏమందు రేని (అని కన్నప్పను జూపుచు) దేవా! చంద్రశేఖరా!

తే. గీ. ఇతని యఱకాలి చెప్పు నీకంగరక్ష,
ఇతని గండూషజలమె దివ్యాభిషేక,
మితని యెంగిలి మాంసమే యశనమయ్యె
ధన్యుఁడనని యింక నెవ్వఁడితండుదక్క? *

(అని లజ్జతో) ఇట్టి భక్తశిఖామణి ననశ్యమనుసరించెదను. బుద్ధివచ్చినది. (అని కన్నప్పను జేరి) కన్నప్పా! ఇప్పుడుమనము సహపాఠులమై జగదీశ్వరుని నిచ్చలు సేవింతము. (అని కౌఁగలించుకొనును).

కన్న:—అనుగ్రహింపఁబడితిని.

కా. హ:—కన్నప్పా! ఇప్పటికిదియే యుక్తము.

కన్న:—మహాప్రసాదము.

కా. హ:—ప్రసాదమా— (అనిస్మృతినభినయించి చిఱునవ్వు నవ్వుచు) నాయనా! మఱచితిని. ఏది- నీ ప్రసాదము- ఆరగించెద నిటు తెమ్ము (చేయిసాపును)

కా. హ:—(అందికొనుటకు కుద్యుక్తుఁడగుచున్నాఁడు)

జ్ఞా. ప్ర:—(శంకరునాపి కన్నప్ప వంకకుఁదిరిగి) నాయనా! కుమారా! నీభార్యనుగూడఁబిలువుము. అందఱము గలసి ముచ్చటగ నిచ్చటనే భుజింతము.

---

* శ్లో. మార్గావర్తితపాదుకా పశుపతే రంగస్య కూర్చాయతే
గండూషాంబు నిషేచనం పురరిపో ర్దివ్యాభిషేకాయతే
కించిద్భక్షిత మాంసమేషకబళం నవ్యోపహారాయతే
భక్తిః కిం నకరోత్యహో! వనచరో భక్తావతంసాయతే.
(శ్రీశంకచార్యకృత శివానంద లహరి)

కన్న:—తల్లీ! అగును మఱచితిని (అని భక్త్యావేశమున మైమఱచి రెం
డడుగులు ముందునకు వైచి) శంపా- శంపా- ఓశంపా! రమ్ము-
రమ్ము (అని కేకలు వైచి స్మృతి నభినయించి నాలుక కొఱు
క్కొని వెనుకకు మరలి వచ్చుచున్నాఁడు)

జ్ఞా. ప్ర:—తండ్రీ! ఎక్కడ నీభార్య- త్వరితముగఁ బిలువుము.

కన్న:—(భయముతో) తల్లీ! క్షమింపుము. మఱచి కేకలు వైచితిని
ఆ సాధ్వి- మీ- స- మక్ష-......

జ్ఞా. ప్ర:—(అర్థోక్తియందే) అదియంతయు నాకుఁ దెలియును. ముందుగ
నీభార్యను బిలువుము. (అని నవ్వుచున్నది)

కా. హ:—వత్సా! ఈమాఱుఁ బిలువుము తప్పక రాఁగలదేమో చూ
తము (అని చిఱునవ్వునవ్వుచున్నాఁడు)

కన్న:—(గ్రహించితి సంతోషముతో) శంపా- ఓశంపా! (అని కేకలు
వేయుచున్నాఁడు.)

(తెరలో)

స్వామీ! వచ్చితిని.

శివశర్మ:—ధన్యాత్ముఁడవోయి నాయనా! పరమేశ్వరి నీ ధర్మపత్నిని
బ్రసాదించెను. అదె వచ్చుచున్నది.

శంప:—(వెంటనే ప్రవేశించుచు) స్వామీ! వచ్చితిని. (అని సంతోష
ముతోఁ బార్వతీ శంకరులకు నమస్కరించి బదంపడి భర్తకు
నమస్కరించుచున్నది.)

కా. హ:—
జ్ఞా. ప్ర:— } సంకల్ప సిద్ధిరస్తు

శంప:—అనుగ్రహింపఁబడితిని.

కన్న:—(నవ్వి) దేవీ! పురాణదంపతులతో రాక-నీవు వెనుకబడితివేమి?

శం:—(నవ్వి) ఇదియంతయు వారి యనుగ్రహమే.

జ్ఞా. ప్రి:—శంపా! ఇటురమ్ము— ఇదేమో చూడుము. (అని పోరబుట్ట నిచ్చుచున్నది)

శం:—(అందుకొనిచూచి ఆశ్చర్యముతో) అమ్మా! ఇది శవభూతి! నీ కెట్లువచ్చెను? దీనికొఱకై నాథుఁడు మిక్కిలి ప్రయాస పడెను. (అని కన్నులకద్దుకొనుచున్నది)

జ్ఞా. ప్రి:—(నవ్వి) అవును- చితియందుఁ బ్రవేశించితి ననికూడఁజెప్ప వేమి?

శం:—(సిగ్గుపడుచున్నది)

జ్ఞా. ప్రి:—(నవ్వి) పోనిమ్ము- శంపా! ఇదిమూకానాఁడు_ అనఁగా నీవు సమస్యనుబూరించితివే- ఆ రేయి లభించినది- కాని, మా కే జ్ఞాపకమునకురాని మాలీలల నెక్కడ సంగ్రహించితివి? మంచి విదుషీమణి వే!

శంప:—(సంతోషముతో మాటఁదప్పించి) తల్లీ! మీరు గావించిన లీలయంతయు నాకిప్పుడవగతమైనది. ధన్యురాలను- ధన్యు రాలను.

శివ:— దేవా! కన్నప్ప పూర్వభవమున నెవ్వఁడైయుండనోపు?

కా. హ:—(నవ్వి) ఇతఁడా- ఇతఁడు- భారతకుల వర్ధనుఁడగు విజ యుఁడు (అని తిన్ననిజూచి) ఓయీ! వినుము.

తే. గీ. తొల్లి పార్థుండవీవు నాతోడ ఘోర
రణమొనర్చితిగాదె వరాహమునకు
మగిడి నిన్ జూడఁగోరి యిమ్మాడ్కిఁబంది
నంపి రావించినాఁడఁ గన్నప్ప! వింటె!

జ్ఞాన. ప్ర:—(వ్యంగ్యముగనవ్వి) పిలువనంపించుట కెక్కడైనఁబంది నంపుదురాయేమి?

కా. హ:—లేకున్నవిల్లమ్ములు బూనిన విలుకాండ్రు రావింప భగవం తునకేనిసాధ్యపడునా? (అని నవ్వును)

శంప:—(స్మృతి నభినయించి తనలో) చెలికత్తె నాఁడు నిదురించుచున్న నార్య పుత్రుని విజయునితోఁ బోల్చినది. అదియేయిప్పుడు సత్యమైనది. ఇంతియగాక యితనితోడి సాంగత్యము ప్రా ప్తింతను వలకనికూడ నిర్దేశించినది. ఆహా! ఏమి! ఈవిచిత్ర సంఘటనము- చెలీ! నీవెంతయు సత్యవాక్యధురీణవు!

కా. హ:— నాయనా- కన్నప్ప! నీకేమి వరముగావలయునో కోరు కొనుము. (అని చీరి బుజ్జగించుచున్నాఁడు)

కన్న:— (ఆనంద బాష్పములు గోటమీటుచు నంజలిబద్ధుడై) దేవా- చంద్రమౌళీ!

తే. గీ. భవహరుండవు నీవు గన్పడిన పిదప
వరము లేటికి?

శంప:— —వేఱొండు వరమువలదు

కన్న:— భవము నాకేల—

శం:— -మగిడి సంభవమిఁకేల

కన్న }
శంప }:— పుట్టువే లేని వరమిమ్ము భూతనాథ!

(అని యిరువురు సాగిలఁబడి నమస్కరించుచున్నారు)

కా హ }
జ్ఞా. ప్ర }:— తథాస్తు (అని అభయహస్తమిడి శంపను శాంకరి యు, శంకరుఁడు కన్నప్పను లేవఁదీయుచున్నారు)

కా. హ:— ఓయీ! కన్నప్పా! తుదిమాట వినుము.

తే. గీ. వడఁతితోఁ గూడ సతతమిప్పగిది నాకు
సేవలొనరించి కడకు నః జేరు మింక
ముందు నీపూజ పిదప నాపూజ జరుగు
నయ్య! శ్రీ కాళహస్తిఁ గన్నప్ప! నిజము.

జ్ఞా. ప్ర:— బిడ్డా! అనురూపుఁడగు నీభర్త నెల్లవేళల ననుసరింపుము.

కన్న, శంప:— భక్తవత్సలా! అనుగ్రహింపఁబడితిమి.

కా. హ:—(శివశర్మవంకఁదిరిగి) నాయనా! నీకేమి కావలయును?

శివశ:—(సంతోషముతో నంజలిబద్ధుఁడై) బాలచంద్రధరా! నేను కోరు కొనునదేమియును లేదు. కన్నప్పతోఁబాటు నన్నుఁగూడ నను గ్రహింపుము. (అని నమస్కరించుచున్నాఁడు)

కా. హ:—అట్టులే (అని లేవఁదీయుచు) కాని- శివశర్మా! ఇంతనుండి యు నీసంతతివారే కాళహస్తియందు నాకర్చకులుగనుందురు. (అని స్మితవదనుఁ డగుచున్నాఁడు)

శివ:—మహాప్రసాదము. అనుగ్రహింపఁబడితిని

కా. హ:—వత్సా! కన్నప్పా! నీవింకేమికోరెదవు?

కన్న:—ప్రభూ! శంకరా! ఇంకఁగోరునది యేమున్నది? అయినను నిట్టగుఁగాక.

(భరతవాక్యము)

తే. గీ. ఏమతంబునఁ బుట్టిన నెట్టిదేశ
మందు బెరగిన నేయుపాయమున నిన్ను
గొలుచునపుడేని జనులు నీగోష్ఠి విడక
కేవలము భక్తిఁగలిగి సుఖింతుగాత!

కా. హ<br>జ్ఞా. ప్ర } :— తథాస్తు- తథాస్తు.

కన్న<br>శంప<br>శివశర్మ } :— హారతిం గైకొని పాడుచున్నారు.

(తెరజారుచున్నది.)

———— ౦౦౦ ————

గద్య:—ఇది శ్రీ మత్కౌండిన్యసగోత్ర పవిత్ర సీతయ్యార్యపుత్ర లక్ష్మీనరసమాంబా గర్భశుక్తి ముక్తాఫల తిరుపతి వేంకటకవి పాదారవింద తత్పర చల్లాభిధాన్వయ పయః పారావార రాకా సుధాకర రాధాకృష్ణ కృపాకటాక్ష సమాసాదిత కవితా ధురీణ లలితోభయభాషాప్రవీణ లక్ష్మీనారాయణ ప్రణీతంబైన దివ్యజ్యోతి యను దృశ్యప్రబంధమునందలి షష్టమాంకము సర్వము సంపూర్ణము.

మంగళమ్ మహత్.

